శ్రీః

శ్రీపాండురంగపరబ్రహ్మణేనమః

భగవద్భజనపద్ధతిః

ద్వితీయభాగః

# వసంతోత్సవసంప్రదాయః



అయం కిల

చెన్నపురీతిరువల్లిక్కేణీనివాసినా

T.N. Kodanda Ra

తి. న. కోదండరామశర్మణా

శ్రీమత్ప్రాచీనభాగవతైరనుష్ఠితం సంప్రదాయమనుసృత్య

తైరనుమోదితాని కీర్తనాని సంగృహ్య

ఆధునికభగవద్భక్తానాముపయోగాయ విరచితస్సన్


చెన్నపురి

ఆనందాముద్రాక్షరశాలాయాం ముద్రితః

1911.

శ్రీః

శ్రీపాండురంగపరబ్రహ్మణేనమః

# భగవత్పూజనపద్ధతిః

ద్వితీయభాగః

# వసంతోత్సవ సంప్రదాయః



అయం చ

చెన్నపురితిరువల్లిక్కేణీవాసినా

తి. వ. కోదండరామశర్మణా

[illegible] విస్తృతం సంప్రదాయ మనుసృత్య

[illegible] కీర్తనానాం సంగ్రహం

సాధుభిర్భగవద్భక్తానా ముపయోగాయ విరచితస్సన్

చెన్నపురి

ఆనందముద్రాక్షరశాలాయాం ముద్రితః

1911.

## రుక్మిణీకల్యాణలగ్నాష్టకం.

1. సత్యజ్ఞానసుఖస్వరూప మమలం సర్వోత్తమం నిత్యదృక్-
ప్రత్యక్తత్త్వ మచింత్యశక్తివిలసద్విశ్వం పరంబ్రహ్మ యత్ ।
లోకానుగ్రహవిగ్రహస్య జగతాం నాథస్య తస్యామరా-
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళం ॥
సులగ్నే సావధాన ॥

2. గంగాద్యా స్సరితో గ్రహాశ్చ శుభదా గంధర్వవిద్యాధరా-
దిక్పాలా ఋషయశ్చ దేవమునయో దేవ్యశ్చగౌర్యాదయః ।
శ్రీవత్సాంకితవక్షసః స్సుమనసా మగ్రేసరస్య ప్రభో-
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళం ॥
సులగ్నే సావధాన ॥

3. యో గోపీనయనోత్పలై రనుపమై రారాధితో గోకులే-
గోపీగోపసుతై రనేకమునిభి ర్హృత్పద్మకోశాంతరే ।
మాయామానుషవిగ్రహస్య మరుత స్తే వాలఖిల్యాదయో-
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళం ॥
సులగ్నే సావధాన ॥

4. బ్రహ్మా విష్ణు కుమారకౌ శ్శ్రుతిచయో వాణీశివామాయుతా-
ఆదిత్యా వసవో గణాధిపముఖా రుద్రాశ్చ భద్రప్రదాః ।
కాలాంభోధరనవ్యకాంతివిలసత్కాయస్య మాయావినో-
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళం ॥
సులగ్నే సావధాన ॥

5. వంశీనాదవినోదనందితసునందాద్యో నవద్యో మహాన్-
నందాద్యై రభిపూజితః పరమయా భక్త్యా ముహుర్లాలితః ।

యః పూర్వం కమలేక్షణస్య కమలానాథస్య తస్యామరా-
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళం ॥
సులగ్నే సావధాన ॥

6. విద్యుత్పుంజనిభాంబరస్య విలసద్గ్రైవేయకస్య ప్రభోర్-
ముక్తాహారమహార్హకాస్తుభమణిగ్రీవస్య కృష్ణాత్మనః।
పూర్ణేందుప్రతిమాననస్య సుతిరాం పూర్ణస్య భక్త్యామరా-
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళం ॥
సులగ్నే సావధాన ॥

7. మీనాంకాధికసుందర స్సురవధూదృక్చాతకాంభోధనో-
గోపీమండలచండభాస్కరలసద్విష్ణుః ప్రియః పూరుషః ।
తస్యాఖండసుఖాత్మకస్య విదుషా మేకాత్మకస్య ప్రభో-
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళం ॥
సులగ్నే సావధాన ॥

8. యే సత్యం ప్రవదంతి సర్వభువనే యా ధర్మశీలాః స్త్రియః-
పాతివ్రత్యపరాయణాస్సురథయో మందారముఖ్యద్రుమాః॥
తే సర్వే యదునాయకస్య మహత స్సర్వాత్మకస్య ప్రభో ॥
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళం-
సులగ్నే సావధాన ॥

9. గర్గాద్యై ర్మునిభి స్సదామితమహాశీర్వాదశర్మాంచితో-
దేవై ర్వ్యోమ్ని విమానమధ్యకలితై ర్దత్తప్రసూనాంజలిః।
సంతుష్టానఘమిత్రభూపనికరైః పౌరైః ప్రియై రావృతో-
రుక్మిణ్యా స్సతతం వివాహసమయే కుర్యాత్ సదా మంగళం॥
సులగ్నే సావధాన ॥

# భగవద్భజనపద్ధతిః

## ద్వితీయభాగః-వసంతోత్సవసంప్రదాయః

వసంతోత్సవదినే మధ్యాహ్నే వసంతమాధవపూజాం కుర్యాత్. అనంతరం కుట్టనోత్సవారంభః

### ౧. కుట్టనోత్సవక్రమః

1. శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే ॥
2. శ్రీకాంతో మాతులో యస్య జననీ సర్వమంగళా ।
జనకశ్శంకరో దేవస్తం వందే కుంజరాననం ॥
3. యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతం ।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥
4. రమాపతి పదాంభోజ పరిస్ఫురితమానసం ।
సేనాపతిమహం వందే విష్వక్సేనం నిరంతరం ॥
5. భగవన్నామసామ్రాజ్యలక్ష్మీసర్వస్వవిగ్రహం ।
శ్రీమద్బోధేంద్రయోగీంద్రదేశికేంద్రముపాస్మహే ॥
6. ఈశే తస్య చ నామని ప్రవిమలం జ్ఞానం తయోరూర్జితం-
ప్రేమ ప్రేమచ తత్పరేషు వినతిశ్చాన్యత్ర సర్వత్రచ ।
ఈశేషాదిగుణాశ్చ యస్య నియతా వృత్తిశ్చ నిత్యాపి యం-
తం వందే నరరూప మంతకరిపుం శ్రీవేంకటేశం గురుం ॥
7. భగవన్నామబోధేంద్ర శ్రీధరార్యాత్మవిగ్రహం ।
శ్రీమద్వేంకటరామాఖ్య దేశికేంద్రముపాస్మహే ॥

8. మహతీజాయతే యేన కృష్ణ భక్తి రచంచలా ।
బాలకృష్ణానందతీర్థం తంవందే యతీనాంవరం ॥
9. నామసామ్రాజ్యరూపాణాం బోధేంద్రశ్రీధరాత్మనాం ।
ప్రణామం యే ప్రకుర్వంతి తేషామపి నమోనమః ॥
10. ప్రహ్లాద నారద పరాశరపుండరీక -
వ్యాసాంబరీష శుకశౌనకభీష్మదాల్భ్యాన్ ।
రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాదీన్ -
పుణ్యానిమాన్పరమ భాగవతాన్ స్మరామి ॥

తోడయమంగళం.

గురుకీర్తనం.

అష్టపదీ-రాధావదన-ఇతి.

గందము-పుష్పము - వక్కలాకులు - పసుపుచమరిన టెంకాయలు - పండులు - కుంకుమపసుపు - నలుఁగుపసుపు - సాంబ్రాణివత్తులు-గందపొడి - కర్పూరము - సాంబ్రాణి - సంపంగితైలము - నూతనవస్త్రము - నిమ్మపండ్లు - ఇన్నియు నొక తాంబాళములో నుంచుకొనునది। మఱియొక తాంబాళములో శోభనాక్షత లుంచుకొని గౌరీకల్యాణము పాడుచు స్వామియొద్దకుఁ దీసికొని రావలయును.

రాగం - నవరోజ్. తాళం - రూపకం.

ప॥ గౌరీకల్యాణ వైభవమే . లక్ష్మీక
1. శ్రీలక్ష్మీకాంతుఁడే శ్రీరాఘవుఁడు
శ్రీలక్ష్మణుఁడె యాదిశేషావతారము - గౌరీక

2. స్వామి యాయుధములౌ శంఖచక్రములు
నేమముగ భరత శత్రుఘ్నులై రపుడు - గౌరీక
3. సీతాసమేతుఁ డాయెను రామమూర్తి
ఖ్యాతిగా వైవాహసుముహూర్తమునను - గౌరీక
4. ధార్మికుఁడైన యాజనక మహారాజు
ఊర్మిళను లక్ష్మణునికి ధారపోసె - గౌరీక
5. నరపతి మాండవిని మఱి శ్రుతకీర్తి
భరతునికి శత్రుఘ్ననికి ధారపోసె - గౌరీక
6. ఇవ్విధంబునస్వామి కల్యాణమందుఁ
బువ్వులవానలఁ గురిసిరి సురలు - గౌరీక
7. రత్నమండపమున శ్రీరామచంద్రుఁడు
రమణిజానకితోడ రంజిల్లు చుండె - గౌరీక



వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే -
మధ్యే పుష్పక మాసనే మణిమయే వీరాసనేసుస్థితం।
అగ్రేవాచయతిప్రభంజనసుతే తత్వం మునిభ్యః పరం -
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజేశ్యామళం॥

నైవేద్యం - కర్పూరారతిః.

ఉలూఖలం ముసలంచాలం కృత్య-ఉలూఖలేశోభనాక్షతా
న్నిక్షిపేత్.

రాగం - సౌరాష్ట్రం. తాళం - చాపు.

ప॥ అల్లోనేరేడల్లో - సీతకల్యాణంబు-చెలువందమాయె.
1. దాశరథిగాఁబుట్టి తాటకను గొట్టి
కౌశికునియాగంబుఁగాచె రఘువరుఁడు

2. భూతలం బెఱుఁగంగ గౌతముని సతికి
రాతిజన్మముఁ బాపెఁ బ్రీతితో నతఁడు
3. జనకయజ్ఞంబునకుఁ జనుదెంచి వేగ
ఘనతరాజులు చూడఁగౌరవంబునను
4. హరునికోదండంబు నపుడు చేపూని
పరఁగఁబట్టె ధనుర్భంగంబుఁ జేసె
5. ఆక్షణమే జనకుఁడతి మోదమొంది
యిక్ష్వాకుతిలకునికి నిచ్చెభూమిజను
6. ఆకాశమున నాకపు యక్షులు దేవతలు
పూవుల వర్షించిరి పుష్పవర్షంబు
7. ఖ్యాతిగా నచ్యుతుండు శ్రీనాథుఁ డపుడు
సీతాసమేతుఁడై వెలసె రఘువరుఁడు

---

రాగము-సౌరాష్ట్రం. తాళం-చాపు.

ప॥ పాహిమాం శ్రీరామచంద్ర రఘురామ
1. సకలజగదాధార సద్గుణనిధే - పాహి
2. జానకీప్రియమనోహర జయదశరథసింహా - పాహి
3. మృదుకృతధనుర్భంగ మునిమనోరంగ - పాహి
4. కారుణ్యగుణధామ కల్యాణరామ - పాహి
5. సకలసద్గుణాపూర్ణ సజలఘనవర్ణ - పా
6. మదనకోటిమోహనగాత్ర మంగళచరిత్ర - పాహి
7. వనచరావృతసౌమ్య వరసార్వభౌమ - పా
8. భక్తహృదయనివాస భద్రగిరివాస - పా

## సుంకులదంచుట.

రాగం - సావేరీ. తాళం - రూపకం.

ప॥ రామరామరామరామ - రామరామరామరామ
రామరామరామ కో- దండరామ

1. సువ్వి రామభద్ర సువ్వి - సువ్వి రామచంద్ర సువ్వి
సువ్విరామాభిరామ - సువ్వాలాలే - సీతా - రా

2. విమలభోగిశయనరంగ - వేదవేదాంతరంగ
అమితకరుణాపాంగ - యఖిలరంగ - సీతా - రా

3. వస్తువైనమాణిక్య - వైడూర్యసౌధమందు
సుస్థిరముగానున్న - కస్తూరిరంగ - సీతా - రా

4. అటుక లనుచు వచ్చిన - యతిథి కన్న మిడినఁ జాలుఁ
గ్రతువు లెన్నియైనఁ జేయఁ - గాంక్షయేటికే - సీతా - రా

5. భాగవతులపాదజలముఁ బైనఁ జల్లుకొన్నఁ జాలు
భాగీరథికిఁ బోదమన్న పయనమేటికే - సీతా - రా

6. దశరథేంద్రవరకుమార - దానవేంద్రదర్పహార
విశదమూర్తికీర్తిహార - విశ్వపూజిత - సీతా - రామ

7. భాగవతము జిహ్వనుంచి పఠనఁ జేసికొన్నఁ జాలు
భాగుమీఱఁజేసినట్టి యమృతపానమేటికే - సీతా - రా

8. రాజవాక్యపాలనిపుణ - రాజవదనరమ్యచరణ
రాజరాజమిత్రపూజ్య - రాజశేఖర - సీతా - రా

9. జానకీముఖారవింద చంచరీక దేవబృంద
మానవేంద్రమానిబృంద వంద్యపదయుగ - సీతా - రా

దంచినసుంకులసమర్పణము.

రాగం-సావేరీ. తాళం - రూపకం.

ప॥ రామరామరామరామ - రామరామరామరామ
రామరామరామచంద్రాయ మంగళం

1. రామచంద్రాయ జనకరాజజామనోహరాయ
మామకాభీష్టదాయ మహితమంగళం - సీతా - రా

2. సాంకుంకుమోపేత చందనానుచర్చితాయ
హారకటకశోభితాయ భూరిమంగళం - సీతా - రా

3. లలితరత్నకుండలాయ తులసీవనమాలికాయ
జలదసదృశదేహాయ చారుమంగళం - సీతా - రా

రెండవసారి సుంకులదంచుట.

రాగం-సౌరాష్ట్రం. తాళం-రూపకం

1. సువ్వని దంచెదరు సుదతులందరుగూడి
సుముఖులై పాటలు పాడుచును - భూ
సురులెల్ల సభలోను వేడుచును
సురుచిరముగ రంభాదులాడుచును
సుమనస్సులుపొగడ సుకవులుకొనియాడ
సుదతిసీతతోడి సుందరరామ - సువ్వాలాలే

2. భానువంశమునందు బాగుగ నవతరించి
బాణమున దాటకను ద్రుంపగను - బహు
భక్తితో యజ్ఞము రక్షింపగను - ఋషి
భార్య సహల్యను బోషింపగను

పత్నులైన భరతలక్ష్మణ శత్రుఘ్న
పవనజసహిత శ్రీపట్టాభి రామా - సువ్వా

రెండవసారి సుంకులసమర్పణము.

రాగం - సావేరి. తాళం - రూపకం.

4. కౌసలేయాయ మంద హాసభూషితాననాయ
దాసరక్షణదక్షాయ దివ్యమంగళం-సీతా - రామ
5. నవసరోజ లోచనాయ నతజనానుగ్రహాయ
పవనతనయసన్నుతాయ పరమమంగళం - సీతా - రామ
6. నగసుతాజపానుకూల నామధేయమంత్రాయ
నిగమముఖచితసుకుచిరాయ - నిత్యమంగళం - సీతా-రామ

---

మూడవసారి సుంకులనంచుట.

రాగం - మధ్యమావతీ. తాళం - త్రిపుట.

1. సువ్విలక్ష్మీనరసింహులకు
సువ్విగరుడవాహనులకు
సర్వాధారులకు సౌభాగ్యధీరులకు
వరదులకు వైకుంఠవాసులకు సువ్వి - సువ్వాలాలే
2. పచ్చనిపందిటిలోపల
ముత్తైదువలకెల్లను వేడుక
క్రొత్తముత్యాపులతోఁ గొలువుకూటమందు
ముదితులై మాధవునిఁబాడుదురు - సువ్వి - సువ్వా
3. బంగారుసరిగంచు పావడమెఱుఁగు
కొంగులుమీఁగాళ్లఁజీరాడఁ

బొంగుచున్న యంగనలందఱుకూడుకొని
బలువేడుకను పాడిదంచెదరమ్మ - సువ్వా
4. సువ్విసువ్వియనిసొంపుగఁ - జిఱు
నవ్వుమోమున ముద్దులాడఁగ
అవ్వారిరత్నము లపరంజితోడను
అమరఁగఁబాడి దంచుదురమ్మ - సువ్వా
5. సువ్విసీతానాయకులకు
సువ్విసాకేతాధిపులకు
సువ్విసకల సౌభాగ్య దాయకులకు
సురుచిరాంగులకు సురహితులకు సువ్వి - సువ్వా
6. రాకేందుబింబాననులకుఁ-దరుణ
రాజీవదళలోచనులకు
పాకశాసనాదిక దేవ బృందవంద్యులకుఁ
బరమయోగిభక్త ప్రియులకునుసువ్వి - సువ్వా
7. అచ్యుతాధిహారవరదులకు భ
క్తాశ్రితజనమందారులకు
సచ్చిదానందులకు సద్గుణాకారులకు
నచ్యుతానంతగోవిందరాములకు సువ్వి - సువ్వా

మూఁడవసారిసుంకులసమర్పణము.

రాగం-సావేరి. తాళం-రూపకం.

7. తారకావతారాయ - ఘోరదురితసంహారాయ
భూరిలోకవర్ణితాయ - భువనమంగళం- సీతా-రామ

8. దేవాదిదేవాయ - దివ్యమంగళవిగ్రహాయ
పావనాయసర్వలోక భవ్యమంగళం-సీతా - రామ
9. సామగానప్రియాయ - సకలలోకపాలనాయ
సదయహృదయపరమహం సాయమంగళం - సీతా - రామ
10. రామదాసమృదులహృదయ - తామరసనివాసాయ
స్వామిభద్రగిరివరాయ - సాధుమంగళం - సీతా-రామ

---

అథముసలనర్తనం - తస్యగీతం లళితలవంగ ఇత్యష్టపదీ.

తలంటుశోభానే.

రాగం - సౌరాష్ట్రం. తాళం - చాపు.

1. శ్రీరామరామయని - సీతాసమేతుని పిలిచి
నారదుఁడుమునితఁజేయు - సగౌరవముగోన - శో
2. సతులెల్లఁగూడుకొని - చక్కఁగఁబాటలుపాడి
పతియైనరామునకు - సీతకు నమస్కరించిరి - శో
3. బంగారుపీఠమున - బాగుగా నెయ్యిఁగస్వామికి
సంగతిగా సంపంగి - తైలము నంటిరి - శో
4. మంగళస్నానము జేసి-బాగున వస్త్రముధరించి
శృంగారభూషణము - సీతశోభకరియించెన్ - శో
5. శోభనమే రఘుపతికి - శోభనమే జానకికి
శోభనమే సర్వాంగస్న - శుభకరవల్లికిపుడు - శో

నూనెనలుగు.

రాగం - శంకరాభరణం. తాళం-ఆది.

1. కోమలగాత్రునికిఁ - గోసలాక్షీశునికిఁ
గామితఫలదునికి - నలుఁగులుపెట్టరే

2. సుందరరూపునికి - సురరాజవంద్యునికి
గంధర్వజనకునికి - నలుఁగులుపెట్టరే
3. సీతాసమేతునికిఁ - జిన్మయానందునికి
వాతాత్మజేశునికి - నలుఁగులుపెట్టరే
4. తారకరూపునికిఁ - దత్వార్థబోధునికి
నారదస్తుత్యునికి - నలుఁగులుపెట్టరే
5. పట్టాభిరామునికి - భక్తసంరక్షకునికి
భద్రాద్రివాసునికి - నలుఁగులుపెట్టరే

నైవేద్యం - కర్పూరారతిః.

సీతావివాహచూర్ణికా.

అథజనకస్య పవిత్రస్వారథ మహార్ణవసంగత్వా పరమానంద జలధౌ మగ్నః - జగచ్ఛ్రుతకులభూషణస్య - జగత్త్రయ సంరక్షణ దీక్షితస్య నతిజనకల్పతరోః శ్రీకోదండ సీతాపతేః - వివాహమహోత్సవాయ। సితాంధపరప్రాంత మనోరథభగీరథవంశజాతం - అతిరథమహారథస్పృథివీపతివందితం - దశరథమహారాజం - రథగజతురగపదాతిసహితం - సమాత్రిపురోహితం - సపుత్రకళత్రం - సహితనారంమహానాయ్య - పత్యుత్థాత్య। నానావిధ క్రముకనాళికేర రంభాది ఫలయుక్తసహస్రశాతకుంభ స్తంభభూషితే - జంభారిచిర కాంక్షితే - పరిపూర్ణ మనోరథ పరమామోద పౌరభక్తజన పరస్పర స్తుతిసల్లాపే - కిరీటకనచకుండల కేయూరనూపుర ముక్తాహారవిభూషిత నానావిధ మృదులచిత్రాసనస్థ నానాదేశాగత రాజన్యబృందే - లోచనానందే - నానావిధ స్వర్ణ పుష్పస్తబకకోటిదేదీప్యమాన మలయచందనాగరుగుగ్గులుగోఘృతానిపరిమళ

వస్తుఘుమ ఘుమాయమానసభాంతరే - నిరంతరమణిఖచితము కురపరంపరే। వీణా వేణు మురజ మడ్డుగ డిండిమ డమరుక ఝర్ఝరి ఝల్లరి ధవళశంఖ పణవ పటహాద్యష్టా దశవాద్యఘోషసంతత శబ్దాయమాన సకలదిగంతరే - నారద తుంబురువీణాగాన మనోహారే - సవత్స గోసహస్రానేక కోటివారణవస్త్రాభరణభూదాన బహుమాన సంతోషిత పాత్రభూతోభయసంబంధి రాజశ్రేష్ఠ వంశావళి నామగోత్ర ప్రవరోచ్చారణనిపుణవసిష్ఠవామదేవవిశ్వామిత్ర శతానందాది సకలమునిగణసంకీర్ణవివాహవేదికామధ్యే। కృతవివిధ స్తవసిద్ధమహర్షి సంఘే-అబ్జభవ విష్ణుభవాదిత్యగణస ప్త మరుదష్టవసుయక్షజన సిద్ధగణరుద్రగణ దిక్పతికులప్రమదవిహిత మిత్రకులకల్మ సుగుణ స్తవసమస్త ప్రశస్తబిరుదస్తోమనినదే - నిరస్తఘనదేంద్రబిరుదే - సంక్రందనాద్యమరబృందావ కీర్యమాణ మందారప్రముఖ నందనవనకుసుమనివహ వర్షే - నవరత్నఖచిత కనకమయమండపే । కించిదారబ్ధ తారుణ్యాం-నతజనైకకారుణ్యాం - విధిముఖసురావిదితప్రతాపం - పరిహృతమునిజనతాపం-భానుకులరత్నప్రదీపం-సంపూరితభక్తజన కామం - సజలజలధర శ్యామం-సకలలోకాభిరామం-శ్రీరామం-సన్నివేశ్య। కేతకీచంపక మల్లికాకుసుమాద్యలంకృత నీలాలకవేణీం-కళహంస గామినీం-కరుణావలోకినీం-అనఘమణిఖచిత హేమనిష్కకంఠీం-స్వరజితకళకంఠీం-హాటకమణిమయతాటంకాలంకృతకపోలాం-అగణితకల్యాణ గుణశీలాం - అరవిందసుందరమందహాసముఖీం - శ్రీరఘునందనాభిముఖీం - సీతాం ।

ఇయంసీతామమసుతా సహధర్మచరీతవ ।
ప్రతీచ్ఛచైనాంభద్రంతే. పాణింగృహ్ణీష్వపాణినా ॥

ఇతి-క్షీరాబ్ధిరివమహాలక్ష్మీం శ్రీమతేనారాయణాయ - శోభన మంత్రాక్షతహిరణ్యోదకధారా సహితం శ్రీరామచంద్రకరార విందేసమర్పయామాస ॥

## శ్రీరుక్మిణీకల్యాణచూర్ణికా.

తత్రఖలుద్వారవత్యాం -సకలసురాసురగంధర్వకిన్నర విద్యాధరోరగనాకనాగర పరిజనాధరీకృతసురేంద్రమహాసభాయాం-తప్తజాంబూనదమయానేకకోటిరవికాంతస్ఫటిక సంఘటితమరతక వజ్రవైడూర్యాద్యనేకరత్న విద్యోతమాన సహస్రస్తంభమండప విరాజమానసురగురు మతిస్పర్ధావర్ధిత విద్యాలసద్విబుధశతసంకులాయాం-అనేకకోటిమహాకవి వందిగాయకహాసకాదిలక్షణ లక్షితాయాం - గర్గప్రముఖమహామున్యధిష్ఠితాయాం - మహారాజ సభాయాం । ఇక్షుక్షీరదధిమధుఘృత గుళగోరోచనజీరకమరీచకాది మంగళద్రవ్యసంభారవత్యాం- గర్గప్రభృతయో వసుదేవానుమత్యా మహాసంకల్పపూర్వకం శ్రీరుక్మిణీకృష్ణయోఃగాంధర్వ విధినా వైవాహికమహోత్సవాయ లగ్నాష్టక మారభంత॥

తెరవేసి అక్షతలతోదీవించుట.

---

### లగ్నాష్టకం*.

1. సత్యజ్ఞానసుఖస్వరూపమమలం సర్వోత్తమంనిత్యదృక్-
ప్రత్యక్తత్వమచింత్యశక్తివిలస ద్విశ్వంపరంబ్రహ్మయత్ ।

---

* రుక్మిణీకల్యాణే కర్తవ్యపాఠభేదః—

సర్వశ్లోకేషు చతుర్థపాదే "జానక్యా" స్థానే "రుక్మిణ్యా" ఇతి పాఠః ॥ తృతీయశ్లోకే ప్రథమపాదే "రామా" స్థానే "గోపీ" ఇతిపాఠః "భూతలే"

లోకానుగ్రహవిగ్రహస్యజగతాం నాథస్యతస్యామరా-
జానక్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళం॥
సులగ్నే సావధాన.

2. గంగాద్యాస్సరితో గృహాశ్చ శుభదా గంధర్వవిద్యాధరా-
దిక్పాలాఋషయశ్చ దేవమునయో దేవ్యశ్చ గౌర్యాదయః।
శ్రీవత్సాంకితవక్షస స్సుమనసా మద్గేసరస్య ప్రభోర్
జానక్యా స్సతతంవివాహసమయే కుర్వంతు తే మంగళం॥
సులగ్నే సావధాన.

3. యో రామానయనోత్సవై రనుపమై రారాధితో భూతలే-
భక్తైః పౌరజనై రనేకమునిభి ర్హృత్పద్మకోశాంతరే।
మాయామానుషవిగ్రహస్య మరుత స్తే వాలఖిల్యాదయో-
జానక్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళం॥
సులగ్నే సావధాన.

4. బ్రహ్మావిష్ణురుమాపతిశ్శ్రుతిచయో వాణీశివామాయుతా-
ఆదిత్యావసవో గణాధిపముఖా రుద్రాశ్చ భద్రప్రదాః।

---

స్థానే "గోకులే" ఇతిపాఠః॥ తస్మిన్నేవ శ్లోకే ద్వితీయపాదే "భక్తైః పౌరజనై" స్థానే "గోభిర్గోపసుతై" ఇతి పాఠః
పంచమ శ్లోకే ప్రథమపాదే "మార్కీనాదపలాయితా సురగణాశ్చర్షో" స్థానే "వంశీనాదవినోదనం దితసునందాద్యా" ఇతి పాఠః॥ తస్మిన్నేవ శ్లోకే ద్వితీయపాదే "ఊర్వ్యై" స్థానే "నందాద్యై" ఇతి పాఠః॥
షష్ఠశ్లోకే ద్వితీయపాదే "రామ" స్థానే "కృష్ణ" ఇతి పాఠః॥
సప్తమశ్లోకే ద్వితీయపాదే "పృథ్వీ" స్థానే "గోపీ" ఇతి పాఠః॥
అష్టమశ్లోకే తృతీయపాదే "రఘు" స్థానే "యదు" ఇతి పాఠః॥
నవమశ్లోకే ప్రథమపాదే "విశ్వామిత్రముఖామరర్షికలితా" స్థానే "గర్గాద్యై ర్మునిభిస్సదా మిళితమహః" ఇతి పాఠః॥

కాలాంభోధరదివ్యకాంతి విలస త్కాయస్యమాయావినో-
జానక్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తేమంగళం ॥
సులగ్నే సావధాన.

5. మార్గీనాదపలాయితాసురగణశ్చుద్ధోనవద్యోమహాన్-
ఊర్ధ్వైశైరభిపూజితఃపరమయాభక్త్యాముహుర్లాళితః ।
యఃపూర్వంక మలేక్షణస్యకమలా నాథస్య తస్యామరా-
జానక్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తేమంగళం ॥
సులగ్నే సావధాన.

6. విద్యుత్సంజనిభాంబరస్య విలస ద్గ్రైవేయకస్యప్రభోర్-
ముక్తాహారమహాస్త్రకౌస్తుభమణి గ్రీవస్య రామాత్మనః ।
పూర్ణేందుప్రతిమాననస్యసుతరాం పూర్ణస్యభక్త్యామరా-
జానక్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తేమంగళం॥
సులగ్నే సావధాన.

7. మీనాంకాధికసుందరస్సురవఘూ దృక్చాతకాంభోధరః-
పృథ్వీమండలచండభాస్కవిలస ద్విష్ణుఃప్రియఃపూరుషః ।
తస్యాఖండసుఖాత్మనస్య విమలామేకాత్మకస్యప్రభోర్-
జానక్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తేమంగళం॥
సులగ్నే సావధాన.

8. యే సత్యంప్రవదంతి సర్వభువనే యాధర్మశీలాస్త్రియః-
పాతివ్రత్య పరాయణాస్సురభయోమందార ముఖ్యాద్రుమాః।
తేసర్వేరఘునాయకస్యమహాతస్సర్వాత్మకస్య ప్రభోర్-
జానక్యా స్సతతం వివాహసమయే కుర్వంతు తే మంగళం ॥
సులగ్నే సావధాన.

9. విశ్వామిత్రముఖామరర్షికలితా శీర్వాదశర్మాంచితో -
దేవై ర్వ్యోమ్ని విమానమధ్యకలితై ర్దత్తప్రసూనాంజలిః
సంతుష్టానఘమిత్రభూపనికరైః పౌరైః ప్రియైః రావృతో -
జానక్యా స్సతతం వివాహసమయే కుర్యాత్సదామంగళం ॥
సులగ్నే సావధాన.

రాగం - కాపి. తాళం - చాపు.

ప॥ అవలోకయ సీతా(భైష్మీ) వదనం రామ(కృష్ణ)
భువన సుందర మిహాభూశశినం - అవ

1. నవ నీలోత్పల(నవనీతప్రియ) వదనం సీతే(భైష్మి)
భవతాతారక మతిశోభనం
కల్యాణం తవభవతుసదా
కనకాంబర కనకాభే జానకి(రుక్మిణి) -అవ

2. సంకల్పంకురు కౌశికశిక్షిత(కంసరిపోజయ)
సత్యంప్రతి ధర్మాచరణం
పంకేరుహనయనామరనరపతి
పరిమది భౌమ్యా(భైష్మ్యా)సహ రామ(కృష్ణ)-అవ

3. భ్రూమధ్యం పరిసంమృజ్యాచ్యుత
భూషయ భూజా(భైష్మి)వదనమిహా
కామంయుగ వినిహితకనకాంబుభిస్
స్నపయహరే సీతా(భైష్మీ)మధునా -అవ

4. నవ్యసుందర పరిధానేనానఘ
దేవీమధునాచ్ఛాదయభో
దివ్యకనకమణి మంగళసూత్రం
దేవీకంఠేథ బధాన - అవ

5. పూరయోధ్యామహతీ (ద్వారవతీనగరీశవ) సుఖదా
ధీర హారే రమయా భవతు
కారణ జగతా మసురవిదారణ
నారాయణ తీర్థాకరణ - అవ

__వైదికమంత్రేణ మాంగళ్యసూత్రధారణం.__

మాంగళ్యతంతునా నేన మమ జీవనహేతునా।
కంఠే బధ్నామి సుభగే త్వం జీవ శరద శ్శతం॥

---

__అక్షతారోపణం.-తద్విషయకశ్లోకాః. *__

1. ఆదాతుం ప్రియయా తదంజలిగతాన్ రఘూద్వహః తేప్సితాన్ముక్తాఫలాన్యక్షతైర్-
దేవీ సంభృతమంజలిం మునిజనోద్ధూతాన్త్యాంతికం ప్రాపయత్।
తస్మిన్ క్షిప్తమముం పేముష్టి ద్రుతమనసానాకాంతలజ్జాన్వితం-
సాచీకృత్యముఖంవము మాచతము భావేతాదృశౌతౌ ముహుః॥
2. దేవ్యాః పాణిసరోరుహాంజలిగతా రక్తాస్తు ముక్తాస్థితా-
యాముక్తాగళితానురాగమనులాంబామా స్తుమాంగాత్రయాః।
యాతాస్తాః ర్ఘ్యఘ్రూహాసస్యహిమం సామ్యంవిశుద్ధాత్మనస్-
తాః కుర్వంత్వఖిలశ్శుభాని సతతం శ్రీరామవైవాహికాః॥

రాగం - పంతువరాళి. తాళం - చాపు.

కల్యాణగోపాలం కరుణాలవాలం
మాంగల్యలంకృత మందహాస సునగోపాలం

* ఇష్టికే కల్యాణవిషయే "రఘు" స్థానే "యదు" ఇతి "దేవి" స్థా
ణ" స్థానే "కృష్ణ" ఇతిచ పాఠభేదః॥

2. అమరనారీగీతం - ఆగమవిదితం
అమితభాగ్యోపేతం - ఆశ్రయేనంతం
3. సకలజగత్కారణం - సత్యకామాదిగుణం
భృత్యసంరక్షణం - బంధమోక్షణం
4. మురలీసరళీగానం - మునిబృందాధీనం
శరణాగతపాలం - శరదిందువదనం
5. భవతిమిరఘనభానుం - భక్తకామధేనుం
శివనారాయణతీర్థ శీఘ్రవరదానం

రాగం - శంకరాభరణం. తాళం- ఆది.

1. జయజయ బాలగోపాల - జయజయ మదనగోపాల
జయజయ విజయగోపాల - జయజయ కల్యాణగోపాల
2. పరమపురుషపదాబ్జ - భక్తజన భవభయవినాశ
నిరుపమగుణరత్నకోశ నిత్యనిర్మలకీర్తిపూరితాశ
3. బ్రహ్మాది సురవంద్యపాద - భవబంధహృదయ గ్రంథిభేద
బ్రహ్మణ్యదేవ శ్రుతివేద్య బలభద్రావరజ భక్తవరద
4. సురవధూపరిగీతవిభవ భక్తసుఖకర పరిపూర్ణ
నరనారీకృతజపానుసేవ శివనారాయణతీర్థదేవ

డోలోత్సవః - పవళింపూత్సవక్రమప్రకారం కర్తవ్యః.

---

భగవత్కల్యాణావసరవర్ణనం.

శ్రీమదఖిల జగదానందకారకో నారాయణ స్సకలమునివర పారాయణః-నిఖిలబృందారకబృందసంస్కృతానుగ్రహః-లీలామా

నుపవిగ్రహాః-వివిధవిచిత్రశృంగారగుణగణాది విశేషః-కమలజసుర గురువసిష్ఠా(గర్గా)ద్యనుమతం(శ్రుతవాన్ -శ్రీజానక్యాః(రుక్మిణ్యాః) పాణిగ్రహణం కృతవాన్ - జగతాం మంగళకరమంగళ్యసూత్రం కంఠేభద్రాణిసుభగేతి ధృతవాన్-విధిముఖ సంస్తుతవాన -అశ్మారోహణ లాజహోమాదివిధి మంత్ర తంత్ర వివిధక్రియావిశేష మహదాశీర్వాద సమన్వితః - సకలశ్రుతి సమ్మతః - సగుణ నిర్గుణాతీతః - శ్రీజానకీ(రుక్మిణీ) సమేతః-నవరత్న వేదికాయాం-సమ్యగ్విరాజతే ॥

నైవేద్యం - కర్పూరారతిః.



సీతాకల్యాణకీర్తనం.

రాగం - పూర్ణషడ్జం. తాళం-రూపకం.

ప॥ లావణ్యరామ కన్నులారఁజూడవే - అతి-లా
అ-ప॥ శ్రీవనితాచిత్తకుముద శీతకరసుగణ - నిజ-లా
చ॥ నీమనసు నీసొగసు నీదినుసు వేరే రామ
తామసముగు దైవమేల - త్యాగరాజనుత - దివ్య - లా

రాగం - కన్నడ. తాళం - చాపు.

ప॥ భజరే భజ మానస రామం
అజముఖశుక వినుతం శుభచరితం - భజరే
1. శంకరమిత్రం - శ్యామళగాత్రం
కింకరజనగణ - తాపత్రయశమమిత్రం - భ
2. నిర్మితలోకం నిర్జితశోకం
పాలితసుగుణ - మధురామృతపాకం - భ

3. భూసమశాంతం - భూజాకాంతం
నారమఖిలదం - త్యాగరాజహృద్భాంతం - భ

## రుక్మిణీకల్యాణకీర్తనం.

రాగం - ముఖారి. తాళం - ఆది.

ప॥ శృంగారకృష్ణుఁడిదిగోఁ జూడరే - మంచి
బంగారు పావడగట్టి యుంగజునిఁగన్నట్టి - శృ
1. వనజాసనాదిదేవసన్యాలు -
సనకాదిమునులురాజసూనులు
అనిమిషులు గంధర్వకిన్నరులు కొలువంగానే -
అనిశము తుంబురునారదాదులుగానముసేయ - శృ
2. లీలామానుష దివ్యదేహుఁడు - ఇంద్ర
నీలవర్ణుఁడు గరుడవాహుఁడు - గో
పాలుఁడు గోపికాజనలోలుఁడు - సర్వేశుఁ
డూలుఁడు రుక్మిణీసత్యభామామనోహరుఁడైనట్టి - శృ
3. సారవేణుగాన లోలుఁడు - శ్రీ
నారాయణతీర్థపాలుఁడునగ
ధీరుఁడు దేవకీనందకుమారుఁడు - ద్వారకాపురిని
వాసుఁడు భక్తజన మందారుఁడు జారచోరుఁడు - శృ

రాగం - కాంభోజి. తాళం - ఆది

ప॥ ఆలోకయేరుక్మిణీకల్యాణగోపాలం.
అ. ప॥ నీలాంబరానుజం గోపబాలం నీలాళకం - ఆ
1. ద్వారకాపురమంటపే - ద్వాదశాదిత్యసన్నిభే
భూరి రత్నసింహాసనే - భూసురఘనే

రాగం-నాథనామక్రియా. తాళం-ఆది.

ప॥ ఆనంద మానంద మాయెనే

1. మనరాముఁడు (కృష్ణుఁడు) పెండ్లికొడుకాయెనే
మనజానకి(రుక్మిణి) పెండ్లికూఁతురాయెనే
నానోముఫలమెల్ల-నేఁడుసఫలమాయెనే - ఆ

2. వీయాలవారెల్ల వచ్చిరి - వారు
విడిదిండ్లకు నేతెంచిరి
ఎదురుసేసలు చల్లి - యేనుఁగులెక్కి-వచ్చిరి - ఆ

3. వసిష్ఠాదు(గర్గాదు)లందఱు వచ్చిరి -
వారు గీతిమంగళస్నానంబుఁ జేయించిరి
పెల్లంపుదోవతులు - వేడుకతోఁగట్టిరి - ఆ

4. జనకుఁడురామ (జనులుకృష్ణ) పూజఁ జేసెను (జేసిరి)
సీతనుప్రేమమునధారపోసెను(రుక్మిణినితోఁడకూర్చుండఁబెట్టిరి)
రత్నాలతాలిబొట్టు - నమణికంఠమునఁగట్టిరి - ఆ

---

నైవేద్యం - కర్పూరారతిః.

---

కుంభము శిరసునను౦చుకొని నర్తనము జేయుట.

---

లలితలవంగఅనేఅష్టపదిచెప్పి నర్తనము ॥

హరిగోవింద - హరిగోపాల - హరినారాయణ - జగదాధార -

ఇత్యాదిభగ్య జయపుండరీకనందహరికీర్తల ఇత్యంతం సీతోత్స
వ సంప్రదాయ ప్రకారం సంకీర్తనం ॥

---

## అలంకారారతులు.

రాగం - ఉశేనీ. తాళం - ఆది

1. సాకేతనగరవిలాసునికి - సద్భక్తహృదయనివాసునికి
సర్వభువనములయీశునకు - సర్వతేజోమయభాసునకుఁ
గోసలేశునికి - హృన్నివాసునికి- మందహాసునికి - జానకీశునకు
ముత్యాలహారతులు - మనసుతోనెత్తరే - శోభానే

2. దశరథరాజకుమారునికిఁ-జలఁచుభక్తాళిమందారునికి
దశముఖాదికసంహారునికి - ధర్మకలితమార్గవిహారునికి
శూరునికి - నత్యుదారునికి - రణవీరునికి - వేదసారునికి
రత్నాలహారతులు - రమణులెత్తరే - శో

3. అక్షయభవ్యకటాక్షునికి - రక్షితత్రిలోకప్రత్యక్షునికి
రక్షఃకాలాత్యుగ్రశిక్షునికి - యక్షేశప్రముఖసంరక్షునికి
దక్షునికి - సురాధ్యక్షునికి - జలజాక్షునికి - లక్ష్మీవక్షునికి
వజ్రాలహారతులు వరుసతోనెత్తరే - శో

4. అనవద్యమైనపరమానందునికి - వందితసద్భక్తబృందునికి
సుందరుఁడైన గోవిందునికి - మందగమనయోగానందునికి
రామచంద్రునికి - భోగానందునికి - నందనందునికి - సుభగా
పగడాలహారతులు - పణఁతులెత్తరే - శో [నందునికి

---

## భాగవతులమీఁద వసంతముఁజల్లుకీర్తనము.

రాగం - మధ్యమావతి. తాళం - చాపు.

ప. వాసుదేవుని వేంకటేశుని నియమముతో దాసులపైఁ-జల్లరే
అ-ప. ఈశుభవసంతము నిందిరాదేవి
చేసినది సర్వజగములను బాలించు - వా

స్తవేదశాస్త్రకావ్యనాటకాలంకారాది వివిధవిద్యావధానవిజృం
భితాఘోషముఖరీకృతాశేషదిగంతరాళ బహుళభూదేవ సభా
మధ్యే సర్వామిమాం పరిషదం ప్రణమ్య స్వాంజలిబంధావి
మౌదంపతీ - ఆఖండలప్రముఖాఖిలసురబృంద హృదయ పుండరీక
చండకిరణస్య విచిత్రజ్ఞానబలశక్త్యాద్యనంతకల్యాణగుణభూషిత
స్య - ఆశ్రితజనవాంఛిత సకలపురుషార్థప్రదాన ధురంధరస్య -
భగవతః పరమాత్మనః శ్రీమన్నారాయణస్య కృపయా - అనవర
తాయురారోగ్య ఐశ్వర్యౌదార్యగాంభీర్య చాతుర్యసౌందర్య
ధైర్యవీర్య శౌర్య మహోత్సాహ గుణసంపదౌ బహుమిత్రౌ
నృతిగాత్రౌ సుచరిత్రపవిత్రగోత్రౌ సుబుద్ధికాంతియశోబలాఢ్యౌ-
శ్రద్ధాకృతి గురుప్రియా - శుద్ధా వితతదుర్జయా - వినతిప్ర బ
లకరణౌ - విహిత స్వజనభరణౌ - సత్యకర్మఫలితౌ - సత్యకర్మ
నిరతౌ - సజ్జనసుముఖౌ - అన్యోన్యానుగతమహాప్రీతిమంతౌ - వా
గ్భూతిమంతౌ - బహుఖ్యాతిమంతౌ - శ్రీరామభక్తిమంతౌ - బ
హుళ భోగ్యవంతౌ-సకలభాగ్యవంతౌ చ భూయాస్తామితి భవంతో
మహాంతోఽనుగృహ్ణంతు॥ ఇమౌదంపతీ వేదవేదాంగన్యాయత
ర్కశాస్త్ర శ్రౌతశాస్త్ర ఆయుర్వేదధనుర్వేద సంగ్రామకావ్యనాట
కాలంకార విద్వద్వీణావేణు మృదంగపటహడక్కాకచ్ఛపనాది ఇం
ద్రజాలమహేంద్రజాల సృష్టిముష్టిచింతిత లాఘవలాఘవ స్వేచ్ఛాగ
మనసాముద్రికాలక్షణనానాభాషాశ్వపరీక్ష సేనాపరీక్ష తంత్రవా
దివిషహార్యగ్నిప్రత్యౌషధ మోహనోచ్చాటన అగ్నిస్తంభ వాయు
స్తంభ గజస్తంభ సేనాస్తంభ గణితవిద్యానాస్త్రాదిచతుష్షష్టికలా
సామర్థ్యసంపన్నౌ చ భూయాస్తామితి భవంతో మహాంతోఽనుగృ
హ్ణంతు ॥ అనయోర్దంపత్యోః సురాసురేంద్రమణిమకుటాలంకృ

తపాదాబ్జయుగ్మస్య కటితటోల్లసత్కరటి చర్మధరస్యఫాలనయ నాప్లుష్ట పంచబాణస్యకాలమదభంజనస్య వల్లభావక్త్రవిలోకనవి జృంభితనాట్యశీలస్య సంధ్యానటనస్య కృపయా ప్రాలేయాచల నిరర్గళ నిరంతర నిష్పతద్గంగా ప్రవాహావాగ్విలాససంపన్నానా మ ష్టకం భూయాదితి భవంతో మహాంతో నుగృహ్ణంతు ॥ ఏతద్గ్రా మస్థాస్సర్వే విద్వన్మహాజనానీరోగా నిరుపద్రవా స్సదాచార సం పన్నాస్సాగ్నిహోత్రాస్సమవేతా ఆఢ్యానిర్మత్సరా భగవద్భక్తా శ్చభూయాసురితి భవంతో మహాంతో నుగృహ్ణంతు ॥ రాజాధార్మి కో విజయీభవతు ॥ దేశోయంనిరుపద్రవోస్తు ॥ సర్వేజనాస్సు ఖినోభవంతు ॥ సమస్తసన్మంగళానిసంతు ॥

భాగవతైర్జ్ఞాతసవస్త్రాదీనాం సమర్పణా

మహానైవేద్యం - మహాదీపారాధనం.

మంత్రపుష్పం.

విఠ్ఠలవిఠ్ఠల- జయజయవిఠ్ఠల - ఇతి నామావళిః

నిత్యోత్సవ సంప్రదాయ ప్రకారం సకలదేవతాస్మరణం.

నమస్కారః.

---

తీర్థప్రసాదవినియోగః.

రాగం - శంకరాభరణం. తాళం - త్రిపుట.

ప॥ శ్రీహరిపాదతీర్థమే చల్లని మందు

అ॥ మోహపాశాదులం ద్రోసి

మోక్షమునిచ్చు మందు - శ్రీహరి

1. కారమై గాటుహెచ్చని కడుఁజల్లఁ జేయుమందు
నూరనికాఁచనియట్టి నును పైనమందు
పూర్ణమై పేరఁబెట్టుకొను తియ్యనిమందు
వేఱువేళాకులు లేని - వేరు లేనిమందు

2. గురువైన రోగములగుణముఁ జేసెడుమందు
దురితము లెడఁబాపు దొడ్డదగుమందు
నిరతము బ్రహ్మాదులు నేర్పున సేవించుమందు
నరకము లేనట్టి నయమైన మందు

3. పొంకముగ హరిభక్తిఁ - బొందఁ జేసెడు మందు
మంకు బుద్ధులనణఁచి- మన్నించుమందు
పంకజాక్షి యలమేలు మంగపతి వేంకటేశు
శంక లేక దాసులెల్ల - సేవచేసెడుమందు

ఇతి ప్రసాదవినియోగః

గ్రామప్రదక్షిణం.

---

అథ బ్రాహ్మణభోజనం

1. గంధర్వరాజప్రతిమం లోకే విఖ్యాతపౌరుషం।
దీర్ఘబాహుం మహాసత్వం మత్తమాతంగగామినం॥

2. చంద్రకాంతాననం రామమతీవ ప్రియదర్శనం।
రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణం ॥

3. ధర్మాభిలక్ష్మః పర్జన్యం హ్లాదయంతమివ ప్రజాః।
నతితర్ప సమాయాంతం పశ్యమానో నరాధిపః॥

4. ద్రష్ట్యమినూనం సుకపోలనాసికం -
సితాననోకారుణ కంజలోచనం ।

## ౨. వసంతకేళికాక్రమః.

దారోజగన్నాథ కీర్తనవళికు నిత్యోత్సవము జరిపించి - వసంత కేళిక నారంభము జేయవలయును ॥

సంగ్రహాముగ తోడయమంగళం.

గంధపుష్పములతో నిద్దఱు భాగవతులకు నలంకారముఁజేసి వర్తనముఁ జేయుమనవలయును ॥

శబ్దం - తద్ధిమిధిమి - ఇతి ॥

మొదట లలితలవంగఅనే వసంతాష్టపదిచెప్పి నర్తనముజేయవలయు ॥

సతీవిరహాము.

ద్విపద ॥ జలజాక్షుగుణములా- సకియవర్ణింప
సలలితగతిరాధ - సర్వమాలించి
మరునిశరంబులు - మర్మముల్ వేఁపఁ
పరమమోహంబునఁ - బలికెనెచ్చెలికి

రాగం - వసంతభైరవి - తాళం - అట.

1. ప్రియసఖవేంకట రమణునిరమ్మని
పిలువవేఁయో ముద్దుగుమ్మ
దయగలనాప్రాణనాయకునీడకుఁ
దరుణీమణితోడితెమ్మ - ప్రియ

2. ఎంతనిమోహము తాళుదునే యో
యింతిరో మనవిచేకొమ్మ
కాంతునినే నెడఁబాసిసహింప నో
కాంతామణితోడి తెమ్మ

3. చక్కనివేంకట రమణుఁడునన్నెంత
చిక్కులఁబెట్టెనేచాల
మక్కువతో వాని మనసెఱుఁగక యే
మఱితినినో భామ - ప్రియ

4. భామరో భద్రాచలమున నెలకొన్న
భద్రునిఁదలఁచితినమ్మ
నామనసునెఱిఁగినా నాథునినీవేళ
నళినాక్షిరో తోడి తెమ్మ - ప్రియ

దూతీళం దేశము.

ద్విపద॥ అనియిట్లుసతిరాధ - యంగజబాధ
వనరుచుఁబతిఁబిల్వఁ బంపనచ్చెల్వ
యమునానదీతీర ప్రాంతంబుఁజేరి
విమలమతింజని విశదమౌపులిన
తలమునశశికాంత తరుణకాంతులను
గలకంఠికై తమిఁగాచెడివాని
సరసిజనేత్రుని జలదాంగుఁజూచి
కరములుముకుళించి కలికియిట్లనియె

రాగం - యదుకులకాంభోజి. తాళం-త్రిపుట.

ప॥ ఏమాటలాడిన నీమాటలేకాని
యేమిచెప్పిన నెదురాడదురా

అ-ప॥ తామరసాక్షా నీవెపుడువత్తువోయని
తలవాకిలిల్లుగా నిలఁబడుచును- ఏమా

1. కన్నులనీరు కాలువలై పాఱెనురా
కాంతవిరహాగ్నిని గనఁగూడదురా
నిన్నెడఁబాసి యరనిమిషమోర్వదురా
వన్నెకాఁడాయోరీ వలదనరాదురా - ఏమా

2. మనసునకింపైన సొమ్ములు పెట్టదురా
మరివెలహెచ్చైన చీర గట్టదురా
తనివినాహారము నిదురయుఁగాంచదురా
తాళుమనిన ధైర్యముపుట్టదురా - ఏమా

3. సొగసుగుబ్బలనున్న ముత్యాలసరులెల్ల
సొబగులేక చిట్లి నున్నమయ్యెనురా
మగువ తెగువచేసి మాననిపొందుతలఁచి
వగకాఁడ శ్రీరాజగోపాలదేవ- ఏమా

రాగం - శంకరాభరణం. తాళం - రూపకం.

ప॥ దారిజూచుచున్నది - నీదుప్రియ
తరళాక్షియూచిన్నది

అ-ప॥ వారిజముఖినీవు వచ్చువేళయనుకొని
కోరికతో రాజగోపాలసామినీ - దారి

1. వెన్నెలగాయఁగ వేడ్క - మీఱ - మంచి
సన్నజాజివిరులసరులును గంధము
పన్నీటిచెంబులు పడకింటిలోనుంచి
వన్నెలాఁడి తలవాకిట నిలిచి నీ - దారి

2. ఏవగనైన నను నెందుఁజప్పడైన
నీవో యని యెంచి తిరిగి చూచి
యీవగఁజిత్తము నిచ్చలునిలిపినట్టి
భావమెవరికైన బయలైనవెఱవక నీ - దారి

3. పచ్చిపచ్చిగాను బదములుపాడుచు
వచ్చిరాజగోపాలస్వామి నీవు
ముచ్చటలాడుచు ముద్దులుపెట్టుచుఁ
గ్రుచ్చికౌఁగిలించి కూడుట దలఁచి నీ - దారి

---

పుష్పాపచయము.

ద్విపద ॥ శృంగారవతిరాధ - చెలికత్తెతోడ
రంగారువనికిని - రయముతోవచ్చి
మందారమల్లికా - మండలిఁజూచి
యిందీవరేక్షణ - హృదయంబునందుఁ
గందర్పజనకునిఁ - గాంక్షతోఁదలఁచి
సుందరాంగులమోముఁ - జూచి యిట్లనియె

రాగం-యదుకులకాంభోజి. తాళం-ఆది.

1. కన్నెలారా మీరందఱు కానరేమే-మన
చిన్నికృష్ణుఁబోలి చెలఁగుపొన్నపూలు

2. కువలయదళాక్షులారా కోరి కొలిచిన - మన
పవనాత్మజు దేవునిఁబోలు కువలయములు
3. కుందరదనలారామనమందఱు సేవించు-గో
విందురదనములఁ బోలుకుందములను
4. పల్లవాంగులారామన తిల్ల గోవిందు - మేని
నుల్లాసమణులఁబోలు నల్లపూలను
5. పంకజముఖులారా భావింపరేమే - శ్రీ
వేంకటేశపదములఁబోలు పంకజములను

రాగం - యదుకులకాంభోజి. తాళం-అది.

1. కన్నెలారామీరందఱు కంటిరేమే - ఈ
పొన్నపూలుపూచియుండు పొందునేఁడు
2. పంకజలోచనలారా బాగుమీఱు - నీ
కుంకుమగన్నేరుపూలు కోయరారే
3. జాజులునన్నజాజులు చాలనేఁడు - విరి
వాజిపూలుకోయరారే వనితలారా
4. మల్లెలుమొల్లలు చేమంతిపూలు - ఇందుఁ
గొల్లలై పూచియున్నవి కోయరారే

---

## రాధాకృష్ణసమాగమము.

ద్విపద॥ ఇవ్విధి రాధ సు-మేషుతాపమున
నెవ్వగ గొన హరి - నెలఁతమదాయఁ
బువ్వులచేగుమ్మ - బూజించియుంతి
వవ్వ మొగంబున - నాథునిఁజేరె

సఖులందఱును గూడి - సంతోషగరిమ
సఖి లేశ్వరునిని రా - ధాబ్జలోచనను
మంగళకరముగ - మహితశృంగార
సంగతులను జేసి - శ్లాఘించిరిట్లు

సఖీజనప్రార్థన-పూర్ణకుంభము పట్టుకొని పాడవలయును.

రాగం-కాంభోజి. తాళం-చాపు.

1. శ్రీరఘుకులనాథ - శ్రీజానకీరమణా - రామచంద్రా-ఓ
మారజనక మధుసూదనమమ్ముఁ బ్రోవు- రామచంద్రా -
2. నీపాద కమలము నెఱనమ్మితిమేము - రామచంద్రా
మాపాపములఁ బాపి మమ్మురక్షింప వయ్యా - రామచంద్రా
3. పూర్ణకుంభముమీకుఁ బొసఁగఁ దెచ్చితిమి రామచంద్రామాకుఁ
బూర్ణ ఫలములిచ్చి ప్రోవవ లెనుహరి-రామచంద్రా
4. బంగారుకలశము బాగుగఁ దెచ్చితిమి-రామచంద్రా-మాకు
మంగళములిచ్చి మాధవ మమ్ముఁ బ్రోవు - రామచంద్రా
5. పంకజనాభ శ్రీభద్రగిరినివాసా - రామచంద్రా - ఓ
వేంకటేశ్వరస్వామి వేగమే మమ్ముఁ బ్రోవు-రామచంద్రా

---

గంధసమర్పణము.

రాగం-ఘంటా. తాళం-చాపు.

1. శ్రీరమణునిలీలలు సంకీర్తనఁ జేయరే చెలులారా
కోరినవేడుచు గందము మాతిల్ల-గోవిందునిపైఁ జల్లరే
2. గందము కస్తూరి బంగారుగిన్నెలోనుంచుకొని
కుందరదనలాడుచు మాతిల్లగోవిందునిపైఁ జల్లరే

3. ఆటపాటలుమించఁగ సొంపుమీఱఁ బోటులురాణింపఁగ
కూటువగంధములు మాతిల్ల గోవిందునిపైఁజల్లరే

4. రమ్మనియొకరొకరు సంగీతము కమ్మఁగఁ బాడుచును
ఘుమ్మనుగంధము మాతిల్ల గోవిందునిపైఁ జల్లరే

5. కవిగాయకులెల్లఁగూడుకొని కడువేడుకనుండఁగాఁ
గువలయూత్తులుగంధము మాతిల్లగోవిందునిపైఁజల్లరే

6. తప్పకమీకోరికలనిచ్చుస్వామినెప్పుడు కొలువరమ్మ
గొప్పగిన్నెల గంధముల్ మాతిల్లగోవిందునిపైఁ జల్లరే

రాగం-ఘంటా. తాళం-చాపు.

1. గంధముకస్తూరి బంగారుగిన్నెలో నుంచుకొని
మందగమన పాడుచుగోవిందునిపైఁజల్లరే

2. గోరోచనగంధము పగడాలగిన్నెలోనుంచుకొని
రాకేనాట్యములాడుచు మాసీతారామునిపైఁజల్లరే

3. కర్పూరయుతగంధము ముత్యాలతట్టగిన్నెలోనుంచుకొని
కర్పూరగంధులారాండా మాయప్పపైనిచల్లరే

4. అత్తరుపన్నీరులు వజ్రాలయెత్తుచెంబులోనుంచుకొని
చిత్తమురంజిల్లఁగా [illegible] నిచల్లరే

5. కుంకుమకస్తూరి బంగారుగిన్నెలో నుంచుకొని
కొంకులేకకూడుచు సంకటహరునిపైఁజల్లరే

6. తళుకు కుంకుమగంధము వెలుఁగు గిన్నెలోనుంచుకొని
కలికిజవేంకటేశుఁ డవ్వకముఖముపైఁజల్లరే

## పరిమళద్రవ్యకుంకుమగంధచూర్ణ సమర్పణము.

రాగం-పూరీకల్యాణీ. తాళం-ఆది.

1. రంగైనకస్తూరి గోరోచనకుంకుమకదంబములు
మంగళమూర్తియైన రామునిపై శృంగారముగఁజల్లరే
2. అగరుగంధములు పచ్చకర్పూరమున ఘుమఘుమనఁజేసి
సొగసైనరామునిపై శృంగారముగఁజల్లరే
3. కుంకుమపూరసము జవ్వాజికోపలోనుంచుకొని
పంకజనేత్రుండైన మమ్మురక్షించు వేంకటేశుపైఁజల్లరే

---

## పుష్పసమర్పణము.

రాగం-వసంతభైరవి. తాళం-ఆది.

1. మల్లెలుమొల్లలు మరువంబుదవనము
చల్లనిపొగడలు చేమంతులు
పల్లవపాణులు పద్మదళాక్షులు
కొల్లలాడుచుఁగృష్ణస్వామిపైఁ-జల్లరే పూలు-చల్లరే
2. పారిజాతములను పంకజములను-మం
దారకుసుమములను శృంగారముగ
నారీమణులనఖచంద్రకాంతులను
సారెసారెకుఁ గృష్ణస్వామిపైఁ-జల్లరే పూలు-చల్లరే
3. మందహాసములతో మగువలు పాడఁగఁ
గందర్పజనకునిఁ గలయుటకు
సుందరముగమీరు సొంపుమీరఁగఁజూచి
మందగమనలుగోవిందునిపైఁ-జల్లరే పూలు-చల్లరే

4. ఇందువదన లరవిందదళాక్షులు
చందనగంధము సరసముతో
నందముతో-నతివలుగూడఁగ
జిందులాడుచు సీతారామునిపైఁ-జల్లరేపూలు-చల్లరే

5. కుంకుమకస్తూరి కురువేరు దవనము
సంకుమదము ఘనసారము
పంకజనయనలు పాటలుపాడుచు
వేంకటరమణుపై చేతులతోఁ బూలు-చల్లరేపూలు-చల్లరే

రాగం-వసంతభైరవి. తాళం-ఆది.

ప॥ చల్లరే పూలుచల్లరే వెదచల్లరే కొల్లలాడరే

1. మల్లెలుమొల్లలు మరువంబుదవనము
చల్లనిజాజులు చేమంతులు
గొల్లలుగా విరులెల్లను కైకొని
చల్లరేజానకిరామునిపైఁ-జల్ల

2. పొన్నలఁబొగడల బొండుమల్లెలను
సన్నగన్నేరులఁ జెంగల్వల
సన్నజాజులనుజాజి యెన్నెన్నోవిరులను
గన్నులవిల్తునిఁ గన్నకమలాక్షుపైఁ-జల్లరే

3. మెల్లనేమెల్లనే మెఱుఁగుకమలములం
దెల్లచేమంతుల నెల్లపూల
నుల్లమురంజిల్ల నుంచికరమ్ములఁ
జలదరు వేంకటాచలపతిపైఁ-జలరే

రాగం-ఘంటా. తాళం-చాపు.

1. జాజులమ్మజాజులే-గోవిందరాజులపైఁజల్లరే
2. సన్నజాజులుపొన్నలు-రాధా-కృష్ణస్వామిపై నిచల్లరే
3. మల్లెపూలుమొల్లలు-మనరామ-భద్రునిపైఁజల్లరే
4. కురువేరువిరివాజులు-మారాజ-గోపాలునిపైఁజల్లరే
5. కలువలుచెంగల్వలు మహాలక్ష్మీ-కాంతునిపైఁజల్లరే
6. మరువంబుదవనములు-నారాయణు-చరణముపైఁజల్లరే
7. పంకజమందారములు-వేంకటేశ-చరణముపైఁజల్లరే

## పూలచెండ్లు.

రాగం-పున్నాగవరాళి. తాళం-చాపు.

1. తామరపూవులు తప్పక నేవేయుదుఁ
దరుణిరో నీముద్దు మోమునకిపుడు
2. మల్లెపూవులు మఱవక నేవేయుదు
మగువరో నీతుంగ కుచములనిపుడు
3. చేమంతిపూవులు చక్కఁగ నేవేయుదుఁ
చెలియరో నీముద్దుఁ జెక్కిటనిపుడు
4. పొన్నలుపొగడలు పొందుగ నేవేయుదుఁ
కన్నెరో నీముద్దుఁ గన్నులనిపుడు
5. ప్రేమతోఁ జేమంతి సంపంగిపూవులువేయుదు నే
సామజగమనరో నీగుబ్బలనిపుడు
6. కలువవిరులను జెలువఁగ నేవేయుదుఁ
గలికిరో నీ వాలుఁగన్నులనిపుడు

7. సంపంగిమొగ్గలు సారెకువేయుదునే
నింపుగ నీముద్దు చెంపలనిపుడు
8. పారిజాతములనే వేయుదునొక
పారివేంకటేశ పదములనిపుడు

---

వేఱు ఆనందావహమైన స రసములు.

ఈటి

పః డోలతరాధాసంగ గిరిధర - డోలత
1. లాలభయోబృందావన జమున
కేసరిశోభిత రంగ గిరిధర-డోలత
2. అభిరగులాల ఉడావతిరాధా
భరసచకారిరంగ గిరిధర-డోలత
3. మీరాకేప్రభు గిరిధర నాగర
చరణకమలబహురంగ-గిరిధర - డోలత

---

వెనుక రెండు తాంబూలములలో హారతికలిపి యెత్తుకొని మధ్యమున దీపముఁ బెట్టుకొని హారతి యెత్తుట ॥

రాగం-సౌరాష్ట్రం. తాళం-ఆది.

పః శోభానే శోభనమే - వైభవమునఁ బావనమూర్తికి- శోభానే
1. బ్రహ్మాది దేవతలు సన్నుతింపఁగను
బ్రహ్మవంశ రావణుని శిరముఁదీయఁగను
ధర్మపాలనమునకై ధరణీశుతనయుఁడై
సమ్మతించి యవతరించెను - శ్రీరాఘవుఁడు - శో

2. వరముచేత వనమునకేగి వైదేహితోను
వరముఁగొన్న రావణుని వధముఁ జేసెను
కరుణాకటాక్షుఁడైన కాకుత్థ్సమూర్తియైన
కమలాక్షుఁడు పట్టాభిషేకము పొందెను-శో

3. దేవర్షులైనవారి భయము దీర్పఁగను
దీనరక్షకుఁడు దివ్యజయము పొందెను
దేవదేవునికి సీతాదేవీ సమేతునికి
సేవఁజేసెదు భక్తకోటి హనుమదాదులకు-శో

---

మంగళం.

రాగం - కేదారగౌళం. తాళం - ఆది.

1. శ్రీరంగనాయకునికి - శ్రీపతికిమంగళం
సారంగధరసేవ్యుఁడైన సదయునికిమంగళం
2. పరవాసుదేవుఁడైన పరునికి మంగళం
నరనారాయణుఁడైన సిరిహరికి మంగళం
3. పన్నగశయనుఁడైన పరమాత్మునికి మంగళం
చిన్మాత్రుఁడైన గీర్వాణగేయునికి మంగళం
4. సరసిజలోచనుఁడైన సరసునికి మంగళం
కరిరాజవరదుఁడైన కాంతునికి మంగళం
5. శ్రీరంగనాయకీ భూమిసేవ్యునికిమంగళం
సారంగధాముఁడైన - రంగనాథునికి మంగళం

---

గోపాలావళిపూజితాం ఘ్రిజలరుద్గోపీజనాలింగన-
ప్రేమాసక్తమనోవిలాసపుళకారంభాంకురాంగప్రభా ।
రాధామానసలాళనైక నిపుణస్వాంత ప్రభో మాధవ-
త్రైలోక్యావనపాహిమాం జయవిభో భక్తేష్టచింతామణే ।

గోపికాజీవనస్మరణం - గోవిందాగోవిందా



ఇతి భగవద్భజనపద్ధత్యాం ద్వితీయభాగే
వసంతోత్సవసంప్రదాయే
వసంతకేళికాక్రమస్
సంపూర్ణః.



## 3. పవళింపూత్సవక్రమః.

### మంగళాచరణము.

1. భగవన్నామసాంరాజ్య లక్ష్మీ సర్వస్వవిగ్రహం ।
శ్రీమద్బోధేంద్రయోగీంద్ర దేశికేంద్రముపాస్మహే ॥

2. ఫణిపతిశయనే శ్రీమన్మణిగణరుచిరేమనోహరాస్తరణే ।
కమలామను భవతిసదాయోగ నిద్రోపిపరమపురుషోయం ॥

3. సప్తప్రాకారాంతః పశ్చిమశీర్షోపిదక్షిణాభిముఖం ।
కావేరీద్వయమధ్యే రంగో నిద్రాతిభూమివైకుంఠే ॥

4. శేషాద్రిశిఖరరత్నం త్రిభువనదురితాంధకారమార్తాండం ।
భక్తజనపారిజాతం వందే శ్రీవేంకటేశమఖిలేశం ॥

5. ఉత్తరవేదినివాసం సత్యవ్రతక్షేత్రస్యసమీపనివేశం ।
చిత్తజకోటివిలాసం వందే శ్రీకాంచివరదమఖిలేశం ॥

6. వేదాంతసారసీమ్నా వేగవతీతీరవేదికాధామ్నా ।
హస్తిగిరినాథనామ్నా భూమ్నా కేనాపిభూషితంభువనం ॥

7. మాతాకోమలవల్లీ మాన్యశ్శ్రీశార్ఙ్గపాణిరేవపితా ।
క్షేత్రంచకుంభఘోణం కావేరీసలిలభోగమైశ్వర్యం ॥

8. కౌసల్యావదనేందుం దశరథహృదయారవిందమార్తాండం ।
సీతామానసహంసం రామం రాజీవలోచనంవందే ॥

9. రాక్షసకులవనదహనం రావణమదహస్తిమస్తకేసింహం ।
మునివరదుఃఖచ్ఛేదం రామంరాజీవలోచనంవందే ॥

10. కలశనవనీతచోరే కమలాహృత్కుముదచంద్రికాపూరే।
విహరతునందకుమారే చేతో గోపీసుందరీజారే॥

11. అంచితపింఛాచూడం సంచితసౌజన్య వల్లవీవలయం।
అధరమణినిహితవేణుం బాలంగోపాలమనిశమవలంబే॥

12. సాయంకాలేవనాంతేకుసుమితసమయే సైకతేచంద్రికాయాం
త్రైలోక్యాకర్షణాంగం సురనరగణికా మోహనాపాంగ
మూర్తిం।
సేవ్యంశృంగారభావైర్నవరసభరితై ర్గోపకన్యాసహస్రై
వందేహంరాసకేళీరత మతిసులభం వశ్యగోపాలకృష్ణం॥

---

ఉపోద్ఘాతము.

ద్విపద॥ శ్రీమదస్మద్గురు - శ్రీపాదములకు
నేమంబుతో మ్రొక్కి - నిఖిలజనాళి
రామతారకమంత్ర - రక్తింజెల్ల
ప్రేమయుభక్తియుఁ - బెంపువర్ధిల్ల
జనసంబుధరణిపై - సార్థకముగను
వినిపించువాఁడను - విశ్వవిభుండు
శ్రీరామచంద్రుండు - శ్రీసీతతోడఁ
గూరిమిపాన్పునఁ - గూడిక్రీడించు
శయనోత్సవంబును - శ్రవణపర్వముగ
నయమునసాధుజ - నంబులువినుఁడు

రాగం - తోడి. తాళం - త్రిపుట.

ప. కోసలాధీశుండై కోటిమన్మథాకృతియై
కొలువైన స్వామిని గొనియాడరే

అ. ప. దాసపోషకుండైన వాసుదేవుండే మంచ
హంసములతోను సిం - హాసనముపైని - కో

1. సనకసనందనాది సాధుపూజితుండై
కనకమయమైన కల్యాణమంటపమున
నినకులభూషణుండిప్పుడీసభలోన
జనకకన్యకతోను జగదీశ్వరుండై - కో

2. కరుణాకరుండైన కాకుత్స్థమూర్తియు
భరతలక్ష్మణశత్రుఘ్నులతోన మేతుండై
స్థిరభక్తిగల్గిన హనుమత్ప్రముఖులతో
నా భృత్యాదులు భటులు కులకీర్తినుతింప - కో

3. సకలరాజులకును రాజైన దేవుండు
అకళంకమైనట్టి యద్భుతపుటిష్టుండు
నిఖిలలోకములకు నిత్యమైన దేవుండు
సుకవీశ్వరులకును సొంతమైన దేవుండు - కో

4. సుమనోహరులు పూలవానలుకురియంగ
క్రమముగ రంభాదులు నాట్యంబులాడంగ
సమరసమున నారదుండుగానము సేయ
నమస్కృతుండై వెలయు సుభగేంద్రగురురూప - కో

రామునియొద్దకు సీత సఖులపంపుట.

ద్విపద॥ కమలలోచనుఁడైన - కాకుత్స్థమూర్తి
విమలమానేకాంత - వేదికనుండ
నారాత్రివేళ సీ - తాసితనేత్ర
సారసాక్షులతోడ - సవురొప్పఁబలికె
వినరమ్మసఖులార - విభుఁడింతదాఁక
చనుదేరఁడిచటికిఁ - జందంబదేమొ
సమయమెట్టిదొవిూరు - చయ్యనఁనేగి
క్రమముగానంతయుఁ - గనుఁగొనిరండు

రాగం-యదుకులకాంభోజి. తాళం-జంపె.

ప॥ సమయమేమేస్వామి సమయమేమే
అ॥ రమణిరోకస్తూరిరంగశౌరికిసిపుడు-సమ

1. కలికిరోని దురమేల్కాంచి జలకములాడి
వలువధరియించి పొంగలియారగించి
కొలువుశృంగారమైకోటికందర్పుఁడై
కొలువుకూటములోన కొలువైయున్నాఁడనివింటి-సమ

2. సనకాదిమునులెల్ల సన్నుతులుసేయఁగ
వనజాసనాదిదేవతలు కొలువఁగను
యెన్నలేనివైభవమున నేఁపొద్దుమెఱయఁగ
జనలోచనోత్పల చంద్రుఁడై యున్నాఁడనివింటి-సమ

3. అంగనామణులు నాట్యములుసలుపఁగ
పొంగుచునుగ్గెవారములుసేయఁగాను

చెంగటను విష్వక్సేనులు కొలువంగ
శృంగారశేఖరుండై చెలువందుచున్నాఁడనివింటి - సమ

---

సీతాసందేశము సఖులు రామునికిఁజెప్పుట.

ద్విపద॥ పద్మాక్షిపలుకులు - భావించిరాము
సద్మంబునకునేగి - జలజాతముఖులు
మన్మథాకారుడై - మహిమదీపించు
చిన్మయుఁ శ్రీరాముఁ - జేరి యిట్లనిరి
రాజరాజేశ్వరా - రమ్యచరిత్ర
తేజోవిరాజిత - దేవపరాకు
మునులకార్యంబులు - మున్నదీర్చుచును
జనులవిన్నపములు - చక్కఁగావినుచు
రాజకార్యంబులు - రమణఁదీర్చుచును
భూజననుతుఁడునా - పుణ్యంపుమూర్తి
నామనోనాథుండు - నాహృదీశ్వరుఁడు
నామానసనివాసి - నావల్లభుండు
ఎంతయలసినవాఁడో - యే తేరఁజిటకుఁ
గాంతునెప్పుడు నేను - గాంతునిమోము
నెప్పుడుదర్శింతు - నెపుడు సేవింతు
నెప్పుడుశ్రమమాఱ - నేను జేయుదునో
యనుచునిక్కై సీత - యధిపభూజాత
వినమితశిరమున - వేఁగెడిఁదమిని

రాగం- ఆహిరి. తాళం - త్రిపుట.

ప॥ ఎంత లేదువై భవము లిపుడునీకుఁ
జింతదీరఁబవ్వళింపు శృంగారరాయా

1. గద్దెమీఁదవేంచేసి కనకతల్పమునందు
సద్దులేదాఁక నలసితివి
దిద్దుకొన్నసతితోడ తిరువిసమారగించి
పొద్దుపవళింపు భోగపతిరాయా - ఎంత

2. ఉప్పరిగచవికలో నుయ్యాలమంచముపై
నొప్పుగఁజలులందఱు నూఁచిపాడఁగా
కప్పురపుసురటీలగాలి పైవిసరఁగ
దప్పిదీరఁబవళింపు దేవతలరాయా - ఎంత

3. ఈడులేనిదవరాండ్రు లిందిరాదిరమణులు
తోడనెచ్చెలులతోను దొడలొత్తఁగా
మేడమాళిగలోని మెఱుఁగుచిత్తరువిండ్ల
వేడుకతోఁబవళింపు వేంకటాద్రిరాజా - ఎంత

---

శ్రీరాముడు వీధిలో మెఱవడిపోవుట.

ద్విపద॥ వెలఁదుకలీరీతిఁ-బిలువఁగఁదన్ను
జలజాఁత నేత్రుండు-సంతోషమునకు
హాయలుమీఱఁగ-లేచియొప్పిదమార
సయమునఁజనియె భూ-నందనకడకు

రాగం - సావేరి. తాళం - త్రిపుట.

ప॥ వచ్చు వేడుకఁజూడరే - శ్రీరఘుపతి - వచ్చు

అ॥ మచ్చికతోడను మైథిలి నెలకొన్న
మందిరంబునకు సంతోషచిత్తుఁడై - వచ్చు

1. శిరమున రత్నాల కిరీటము ధరియించి
హారువుగ నుదుటఁ గస్తూరితిలకమిడి
చిఱునవ్వు మోముతోఁ జెక్కుటద్దములను
సురుచిరముగ మెఱయు శుభకుండలము లాడ
ఉరమునఁ గౌస్తుభమణి నానా
భరణములు మెఱయుచు ముదముతో - వచ్చు

2. ఇరుగడలను వింజామరలు వీవఁగాను
మెఱుఁగుమీఱిన బంగారుపాలకెక్కి
మఱియు ధూపమున సంతోషించి
యరవిందదళాక్షుఁ డందముమీఱఁగ
వరపీతాంబరము ధరించి
స్మరశత మోహనకరరూపుఁడు - వచ్చు

3. శాస్త్రప్రవీణు లెచ్చరిక పరాకని
వేత్రహస్తులు ముందు వెనుకఁగొని నడువ
నేత్రోత్సవమున నేఁడు భక్తులచేత
స్తోత్రప్రియుఁడైన శ్రీమూర్తికపటనాటక
సూత్రధారి సుందరశ్యామల
గాత్రుఁడు శ్రీవేంకటరమణుఁడు

## రామాగమనము సఖులు సీతకు హెచ్చరికచేయుట.

ద్విపద॥ వరకిరీటద్యుతి - వన్నెలుమీఱ
మారుమంజిచౌకట్ల - యొప్పుదీపింప
హారావళులనిగ్గు - లవఘళింపఁగను
సారెకునురటీలు - సకియలువైవ
వచ్చి రాముఁడుసీత - వాకిటనిలిచి
హెచ్చరింపుఁడయన - నెలమినివ్వేళఁ
జెలులుధారిణికన్యఁ - జేరియిట్లనిరి
కలహంసగామిని - కంజదళాక్షి
వినవమ్మనాథుఁడు - వేడ్కలుమీఱఁ
జనుదెంచుచున్నాఁడు - సౌధంబునకును

---

రాగం - కేదారగౌళం. తాళం - త్రిపుట.

ప॥ కాచుకొన్నాఁడదుగో నీ - కాంతుఁడా వాకిటిలోన - కా

అ॥ దాఁచినసిగ్గెందాఁక దగ్గఱ చేరఁగదవే యమ్మ - కా

1. కొమరువయసు నాఁటి క్రొత్తపెండ్లికూఁతురా
కమలములోని బంగారుబొమ్మ
విమలమై నిలువెల్ల వెన్నెలగాయుతల్లి
చెమరింప విభు చెంతఁ జేరఁగదవే యమ్మ - కా

2. చందమామతోఁబుట్టిన జవ్వనంపుఁ జెలువలు
కందులేని కపురపుగంధి
గంధపువాసనమేని కలశాబ్ధికన్యక గో
విందుని పాదము లొత్త వేంచేయఁగదవే యమ్మ - కా

3. అతిమోహనాంగియైన అలమేలుమంగమ్మకా
సతులలోన మిగులఁ గలికి చిలుకల కొలికి
పతియైన శ్రీవేంకటపతి కౌఁగిలీయఁగ
సతనితో రతినోల లాడఁగదవో యమ్మ - కా

## సీతాదేవి శ్రీరాముల నెదురుకొనుట.

బంగారుసరిగంచు - పావడఁగట్టి
కమ్మకస్తురితిల - కంబునుదిద్ది
ముత్యపుసరులను - మెడయందుఁదాల్చి
యవయవములసొమ్ము లలవరించుచును
గలికికన్నులయందుఁ - గజ్జలంబుంచి
యలరారుకొప్పున - విరులనుముడిచి
తెలిచుగాఁకర్పూర - తమ్ములమ్మువేసి
పాలిండ్లఁగుంకుమ - పంకనులంది
పసిఁడివ్రజంపుఁ జా - పటబొట్టుఁబెట్టి
రవలమెట్టెలమ్రోఁత - రాణింపఁగాను
బంచాస్త్రిమోహన - బాణమనంగ
విందుబింబాస్యదా - వెడలెమందిరము.

---

రాగం - నాథనామక్రియా. తాళం - చాపు

ప॥ వచ్చెను అలమేలుమంగ - యీగా
పచ్చలకడియాల పరాఁతి చెలఁగా
1. బంగారు చేదివిటీలు పూని
శృంగారవతులు నేవేలు రాఁగ

రంగైన వింజామరలు వీవ
మాంగళ్యలీల సొంపగు జవరాలు - వచ్చె
2. పలుకులఁ దేనియ లొలుకఁ జెంతఁ
జిలుకలు కిలకల పలుక రవల
గిలుకుపావలు ముద్దు గులుక మేటి
కలికి చూపుల మొనలు తళుకని చిలుక - వచ్చె
3. రంభాదిసతులెల్లఁ జేరి యెదుట
గంభీరగతులను మీఱ నటనా
రంభములను మేలు కోరి కొలువ
నంభోజాక్షుఁడౌ వేంకటేశు నొయ్యారి - వచ్చె

సఖులు స్వామిని లోపల పిలుచుట.

తనవాకిటికెడప - దగ్గఱసామి
ఘనతతో నిలుచున్న - గాంభీర్య మెఱిఁగి
మనముసంతోషించి - మగువలఁజూచి
వినయముతో విభు - వేంచేయుమనిన
సుదతులు దెలిసియా - సుందరాకారు
నద్భుతమూర్తికి - నంజలిచేసి
తత్త్వాత్మరూపశ్రీ - తారకనామ
ప్రత్యక్షమూర్తితో - భామలిట్లనిరి.

రాగం - శంకరాభరణం. తాళం - త్రిపుట.

ప॥ వేంచేయ వయ్య మీావిడిదికిని
మచ్చికతోడఁ బ్రసన్న మదనగోపాలా - వేం
1. పగడంపు తలుపుల పట్టె మంచముమీాఁదఁ

బగటుమై విరివాజి పఱపువేసి
జగజెంపుఁ జెంగావి చలువచీరయుఁ గట్టి
యిగురుఁబోణి నీ రాక కెదురుఁజూచుచున్నది - వేం

2. వింతవింతలైన వివిధపుఁ గలపపుఁ బూ
బంతులు తెల్లనాకుల భాగా లమర్చి
అంతరంగము కరఁగ హాయిగఁ బాడుచు
నింతి నీ రాక కెదురుఁ జూచుచున్నది - వేం

3. అంకిలి చెప్పక యరమర సేయక
పంకజాక్ష వేంకటరమణ దేవ
కొంకక చెలిమితోఁ గోమలిఁ గూడుము
ఇంక నీరాక కెదురుఁ జూచుచున్నది-వేం

సఖులు స్వామికి హెచ్చరిక చెప్పుట.

ద్విపద॥ ఆనతిచ్చినవేళ - హావునుమీఱఁగను
శ్రీనివాసుఁడుచాల - శృంగారమూర్తి
కోమలాంగుఁడు దేరఁ - గుసుమంబువిరులు
భామలుచిలికింప - భరతెంబులాడ
శృంగారవనిని ని-ర్మించియున్నట్టి
మంగళకరమైన - మందిరంబునకు
నేకాంతముగవచ్చు - టేర్పడఁ దెలిసి
సాకేతవాసి హెచ్చ - చరికనిటనిరి.

రాగం - యదుకులకాంబోది. తాళం. ఝంపె.

ప॥ హెచ్చరిక సదనంబు - ఏకాంతరంగ
అ॥ హెచ్చరిక సదనంబు - ఇందిరాలోల
ముచ్చటగ మరుఁగన్న ముద్దురంగయ్య - హె

1. పసుపుబంగారు దుప్పటి నేల జీఱ
మిసిమి నెన్నుదుటఁ గ్రమ్మిన చెమట లూఱ
మసలుచును వచ్చెదవు మఱి హారాయలు మీఱ
నసదైన లేత కౌనసీ యాడరాఁగ - హెచ్చ
2. సొలపువగగులుకు కస్తురిబొట్టుజాఱ
మొలకపులకలనె మోము జిగిదేర
నలసియలయని మేనఁ దొలఁకుశృంగార
ముల వచ్చెద డుగులు తడఁబడెనురా - హె
3. అరవాడువిరుల సరు లరుదుగా మీఱ
నరయకనుఁ గవసొగనుల సజ్జాళి దూఱ
నెరనీటుతనము లెంతో ముద్దు గాఱఁ
దెఱఁగొప్పవచ్చెదవు దృష్టితాకునురా - హెచ్చ
4. కరమునను విరుల చిలకయుఁ గాంతిమీఱ
వరుస భక్తులు డాసి వరము లనఁగోర
సరసగతివచ్చెదవు సదనంబుఁ జేర
మెఱుఁగు మెటకలమీఁద మెల్లనరార - హెచ్చ

---

**సీతాదేవి** కవాటము బంధించుట.

---

**ద్విపద॥** సొంపుమీఱఁగస్వామి - సొగసుతోవచ్చు
నింపుజానకిచూచి - యేకాంతమందుఁ
బంతునఁదలుపుల -బంధంబుఁ జేసి
సంతోషముగఁబల్కె - సరసంబులాడ
స్వానుభవుండైన - సర్వజ్ఞమూర్తి
జానకీనుడులకు - పరిసతినాడె.

---

## తలుపులు తీయు పాట.

రాగం-సౌరాష్ట్రం. తాళం-ఆది.

1. రా॥ శ్రీకాంతామణి - శ్రీకాంతుఁడనే
వాకిలిదీయవె భామా - యీ - వాకిలి దీయవే భామా
జా॥ శ్రీకాంతుఁడ నీ చిన్నెలు తెలియక
వాకిలిదీయఁబో వోయి-యీ-వాకిలి దీయఁబోవోయి

2. రా॥ మత్స్యమూర్తినయి - మగువా మున్నా
మ్నాయము కావనె - భామా - యామ్నాయము
జా॥ పడఁతుల కన్నులఁ బడకుము పోమ్మా
యడుతురు నిను మీనాంకా - పడ-నడఁతురు నిను

3. రా॥ అర్థిలితో గిరి నంబుధి మోచిన
కూర్మాంకుఁడనే భామా - యా కూర్మాంకు
జా॥ తాఁబేలా యని తరుణుల పదములఁ
దాఁగుదువే పోవోయి - ఇఁక - దాఁతు

4. రా॥ కిరిరూపంబున ధర మోచిన యా
నరహరిమూర్తిని భామా - శ్రీ - నరహ
జా॥ కిరివైనెంతయుఁ గీర్తి వహించితి
వరుగుము దవ్వగఁ జాలు-మం-దిరమును జేఱుపకు మేలు

5. రా॥ నరకేసరినై హిరణ్యకశిపుని
బరిమార్చితి నే భామా-నీ-వెఱుఁగవె యిదిగుణధామా
జా॥ అరుదు మృగమని - హరిమధ్యలు వం
జరమున వైతురు పోపో - యిటు-దిరుగకు పోపోయి

6. రా॥ వామనమూర్తినై - బలి నణఁగింపఁగ
భైక్ష్యము వేఁడఁగ లేదే- భామా - భై
జా॥ క్రొత్తబిచ్చమిలఁ - బ్రొద్దు నెఱుఁగదు

· తత్తఱపడకుము పోపో-యిది - తరుణము గాదుర-పోపో

7. రా॥ పరశువుచేతను భామా రాజుల
బరిమార్చఁగ లేదేమే-నఱ-బాయుట యిది హితమేమే
జా॥ మాతను జంపిన - ఘాతుక నీ మో
మేతీరునఁ గన నౌనా సతి కియ్యదియును హితమానా

8. రా॥ రాముఁడ నగుచును - రావణుఁ జంపిన
రాజకుమారుఁడ భామా - నా-రక్తిని మఱచెదె భామా
జా॥ నాదు మనోహర - నా ప్రాణేశ్వర
మోదముతోఁ జను దెమ్ము-నా మోహము దీర్చఁగ రమ్ము
వేడుకకై యిటు - వేసితివాకిలి
వేఁడెద సైఁపుము నాథా - నా-నేరము లెంచకు నాథా

---

సీతాదేవి శ్రీరాములను శయనగృహమునకు పిలుచుకొని పోవుట.

ద్విపద॥ ముద్దుమాటలువిని-మోహంబుచేత
సద్దుచేసియట్టి-సైఁగలు దెలిసి
తలుపు తెఱచెనప్డు-తామరసాక్షి
ఘలుఘల్లుమనినిల్చె-గంభీరముగను
కలికినిజూచి యా-కాకుత్స్థమూర్తి
పలుమాఱునవ్వుచుఁ-బొనుపునందుఁ
జేరిసీతను స్వామి-చేపట్టిపిలువఁ
గారుణ్యమూర్తితోఁ-గాంతయిట్లనియె.

---

రాగం-మధ్యమావతి. తాళం-ఆది.

ప॥ పంతము చెల్లెను బదపదరా
ఇంతలోనే తప్పు లెంచకు పదరా

1. రాని కోపమున రట్టుఁ జేసితి వెంతే
పానుపుమీఁదికిఁ బదపదరా
సోనల చెమటల సొలసితి వెంతే
తేనె మోవి దప్పి దీర్చుకోఁ బదరా-పం
2. అనుమానముల నలసితి వెంతే
పనిగలదిఁక నైనఁ బదపదరా
నను నిటు చూడఁగ నవ్వితి వెంతే
తనదగు నెప్పటి తావుకుఁ బదరా-ప
3. వాసిగఁ గాఁకలఁ బడలితి వెంతే
బాసల నమ్మితిఁ బదపదరా
ఆసల శ్రీవేంకటపతి నీవిఁక
వేసారక రతి వేదికిఁ బదరా-పం

---

సఖుల సీతారాముల ఉయ్యాల ఊఁచుట.

---

ద్విపద॥ మగువయీరీతిని-మర్మంబుఁ జెప్పి
సొగసుతీరఁగ స్వామి-సుందరంబగుచు
మన మొప్పశృంగార-మంటపంబునను
చనవుగా వరహంస-శయ్యను జేరి
ఇద్దఱు సరసంబు-లెఱిఁగి మోదమున
శుద్ధమానసముల-సుందరుల్ గూడి
స్వామి గుణమ్ములు-పల్కి వర్ణించి
నామకీర్తనములు-నయముగాఁ జేసి
యాటపాటలుపాడి - యద్భుతంబుగను
ధాటిగాఁ బ్రేమతో-తరుణు లిట్లనిరి

(డోలోత్సవోపక్రమః)

రాగం - నవరోజు. తాళం - రూపకం

ప. సీతాకల్యాణవైభవమే - రాధా - కల్యాణవైభవమే

1. శ్రీరామచంద్రులకు శోభనము నేడు
ప్రేమతో బంధువులఁ బిలువ నంపుదురు

2. ఇక్ష్వాకువంశమునఁ బుట్టిన హరిని
రక్షింపుమని మ్రొక్కెదను రాఘవులకు

3. కుట్టనంబు వెట్టుమని యత్నంబుఁజేసి
కుట్టనంబు కై చాల పరిపూర్ణమగును

4, చిత్రపుమేడలోఁ గొలువుకూటాల
ముత్యాల తోరణాలు కట్టిరి వారు

,5. రాణించు నీలాల కంబాల నడుమ
మాణిక్యదీపాల నెత్తిరి వారు

రాగం - నవరోజు తాళం - రూపకం.

ప॥ లక్ష్మీకల్యాణ వైభవమే - రాధాకల్యాణ వైభవమే

1. పాహి పాహి కృష్ణ పరమాత్మ దేవా
పురవైరి సఖుఁడైన పుణ్యచరిత్ర

2. ప్రకటముగ భూభార వ్యథ తీర్పననుచు - ఇల
దేవకీ కుక్షి నుదయించినావు

3. సకలభువనంబులు తనకుక్షిలోను
సతతంబు నుంచుకొని రక్షింపఁగాను

నలుగు.

రాగం - శంకరాభరణం - తాళం - ఆది.

ప॥ శ్రీరామ జయజయ - సీతామనోహర
కారుణ్యాపాగర - కరుణ నీ దేరా
1. నాపాలి శ్రీరామ - భూపాలనుతనామ
కాపాడసమయము - నీ పాదము లీరా
2. భళిభళి భక్తుల పూజా - ఫలము నీవని కొంటి
నళినలోచన నీకు - నల్గులు పెట్టరే
3. కాయజుని గన్నట్టి - ఘనుడా గోపాలా
మాయలెల్ల తెలిసెరా - మాధవపాదములీరా
4. ఇంద్రాదిదేవతలు - ఎదిరింప గోవుల
మందల త్రిప్పక - వచ్చిన పాదము లీరా
5. జయ దేవకీ కుమార - జయ నీపమందార
జయ ద్వారకాధార - జయ కీర్తిహార
6. అధికముగా గొల్ల - మగువలను గూడుకొని
సదయుడై వెలసితివి - స్వామీ శ్రీకృష్ణా
7. కోటిమన్మథులైన - సాటిగా నీసొగసు
నాటియున్నది మతిని - మేటి శ్రీరఘురామా
8. నిజముపేదకబ్బిన - నిధిరీతి దొరికితివి
వర త్యాగరాజనుత - వరద మ్రొక్కెదనురా

రాగం - సవరోజా. తాళం - ఆది.

1. కోమలగాత్రునికి - గోసలాధీశునికి
గామితఫలదునికి - నల్గులు పెట్టరే
2. సుందరరూపునికి - సురరాజవంద్యునికి

గంధర్వజనకనకు - నల్గులు పెట్టరే
3. సీతాసమేతునికిఁ - చిన్మయానందునికి
వాతాత్మజేశునికి - నల్గులు పెట్టరే
4. తారకరూపునికిఁ - దత్వార్థబోధునికి
నారదస్తుత్యునికి - నల్గులు పెట్టరే
5. పట్టాభిరామునికి - భక్తసంరక్షునికి
భద్రాద్రివాసునికి - నల్గులు పెట్టరే

రాగం - శ్రీరాగం. తాళం - చాపు.

ప॥ నలుగొనరించునీ - నాతిరుక్మిణికి
అలరుఁబోణిరో - నల్గిడు పద్మనాభునికి
1. నవనీతచోరా - నగుగుణాధారా
నల్గిడరావయ్య - నాకీమణితోను
2. పసుపున నల్గిడవే - నీ- పతిముఖమునకుఁ
బణఁతిమోముకుఁ గృష్ణ - పసుపుననల్గిడు
3. అలక్తపంకము - అమరేశాంఘ్రికిని
యువతియంఘ్రికిఁ గృష్ణ - యావకపంకము
4. ఉప్పుతోఁదీర్చురా - యొకదృష్టిలేకయే
పప్పుతోఁదీర్చురా - పరదృష్టిలేకయే
5. అప్పాల చప్పళ్లే - నసుమానింపకురా
పప్పడల చప్పళ్లే - పరువిడదేమొ
6. ఆరతులెత్తవే వారిధిశాయికిని
ఆరతులెత్తరా వార్ధిజాతకను
7. వందన మొనరించి యింకీవరాత్మునికి
వనితరుక్మిణికి నాశీర్వాదముఁ జేయును

పూలచెండ్లు

రాగం - నవరోజు. తాళం - చాపు.

ప॥ పూలచెం డ్లాడెనే - శ్రీరాముఁడు - పూలచెం డ్లాడెనే

అ॥ బాలరో వినవే సద్భక్తసమ్మాన్యుఁడు
కోలాహలముగఁ గూడి జానకితోను - పూల

1. ఇందుముఖుఁడు వాఁడే - సుందరార
విందనయనుఁడు వాఁడే
మందహాసములతోఁ బొందిజానకితోను
అందముగ నేఁడు సంతోషచిత్తుఁడై - పూ

2. సకలజనులు పొగడ - రాముని కీర్తి
సభలోను గొనియాడ
గగనచారులు జాజిరేకులవర్షము
అఖిలభూమిపైన యద్భుతముగఁగురియ-పూల

3. మంగళమూర్తి వీఁడే శ్రీరఘుపతి
మహిమ గల్గిన వాఁడే
పంకజనయనరో భద్రాద్రివాసుఁడే
శృంగారమైనట్టి సీతాసమేతుఁడే - పూల

పూలచెం డ్లాడెనే శ్రీకృష్ణుఁడు - పూలచెం డ్లాడెనే
బాలకృష్ణుఁడు - పూలచెం డ్లాడెనే
పరమాత్ముఁడు-పట్టిచెం డ్లాడెనే

రాగం-కాపి. తాళం-చాపు.

ప॥ పూలబంతులాడరారా - పూవుఁబోణితోనుగూడ

1. పూలబంతులాడరారా - పూవుఁబోణితోనుగూడ
జానెనచేమంతితోడ - సంపంగిచెండతియాడ

2. మాణిక్యమకరమున - మగువరుక్మిణితోనుగూడ
మత్స్యావతారుఁడా లేరా - మల్లెపూలచెండ్లాత్రియాడ

---

సీసపద్యము.

హరిరామనీవు నా యంతరంగమునందు
సాక్షివై యుండుట సత్యమైనఁ
బావనంబాయెను బాంచభౌతిక మైన
కాయంబు జలములఁ గడుగనేల
నమకారముడిగిన మానునుగర్వంబు
నేమాని వేల్పుల నేఁడనేల
విత్త క్షీణంబయిన విడుచును గర్వంబు
మోహంబు లుడిగిన మాటమిదియే
విషయాసక్తి నిజముగ నిలిచెనేని
మనసు దృఢమైనఁ జాలదా మాయఁ గెలువ
భ్రాంతులుడిగిన బ్రహ్మంబు బట్టబైలు
రామతారక దశరథరాజతనయ.

---

శోభానే.

1. కణ్ణనెన మూదైయినిల్ పిఱందవరుక్కు
వెణ్ణైయుమ్పాల్ తిరుడి ఉండవరుక్కు
వెణ్ణోరుం కొండాడ కట్టి మకిళ్ద పలుంగ
వణ్ణపొంగా తీర్త్త శోన్ యెన్ ప్రాణనాదరుక్కు - శోభానే
2. పేయిన్ ముల్లై యుండవర్కై నానుత్తవరుక్కు
కాయుం శకటనై కాలాలుదైత్తవరుక్కు

ఆయనై త్తోత్తిరాయ్ క్కొండాడి మాడుమేయ్ త్తవరుక్కు
నాయకరాయ్ వందెనక్కు వాయ్ త్తవరుక్కు - శో

3. కూఱై తిరుడి కుఱంది లేఱినవరుక్కు
నీరై విట్టు వా వెన్ఱు కూఱినవరుక్కు
తాఱుమాఱాయ్ప్పేశి యవర్మానమళిత్తు మడువిల్
వారణత్తై క్కాత్త నల్ల నారాయణర్క్కు - శోభానే

---

మంగళం.

రాగం - పున్నాగవరాళి. తాళం - జంపె.

ప॥ జయమంగళం నిత్య శుభమంగళం

1. కరుణారససాంద్రాయ కామారివినుతాయ
తరుణారుణాతి సుందరపదాయ
నిరుపమశరీరాయ నిఖిలాగమచరాయ
సురవినుతచరితాయ సువ్రతాయ

2. కుందసమరదనాయ - కుంభజనుగేయాయ
మందరాగధరాయ - మాధవాయ
కందర్పజనకాయ - కామితసుఫలదాయ
బృందారకారాతి - భీకరాయ.

3. సర్వలోకహితాయ - సాకేతసదనాయ
నిర్వికారాగమ్య మా - పతిసదనాయ
సార్వభౌమాయ - పోషితత్యాగరాజాయ
నిర్వాణఫలదాయ - నిర్మలాయ

---

## ఉయ్యాల.

రాగం- నీలాంబరీ. తాళం- జంపె

ప॥ నయ్యాటపాటలను సత్యాసర్వభౌమా
ఉయ్యాల లూఁగవయ్యా

1. కమలజాద్యఖిలసురులు నినుఁ గొలువ
విమలులైన మునీంద్రులు ధ్యానింపఁ
గమనీయభాగవతులు గుణకీర్త
నముల నాలాపంబులు సేయఁగ-న

2. నారదాదులు మెఱయుచు - నుతిఁజెందు
సారములు బాగ వినుచు - నిను నమ్ము
వారల సదా బ్రోచుచు - వేద
సార సభలను జూచుచు - శ్రీరామ-న

3. నవమోహనాంగులైన సురసతులు
వివరముగఁ బాడఁగ - నాభాగ్యమా
నవరత్నమంటపమునఁ - త్యాగరా
జవినుతాకృతిఁబూనిన - శ్రీరామా-న

రాగం-భైరవి.

1. నిగమగిరిశిఖరనియతాధివాస
నిర్మలచిదానంద నిత్యభాస
విగళితమహామోహ తిమిరజాల
విపులతరశుభలీల విశ్వమూల

2. గోవిందవిహార రమయాసమేత
గోపాలవిహార రమయాసమేత
శ్రీకృష్ణవిహార రమయాసమేత
శ్రీనాథవిహార రమయాసమేత.

సమ్మిన యిందిరాదేవి సన్నెను వసంతమునీకు
సమ్మతించి మబ్బునీర జలకమాడవయ్యా
2. పట్టరాని విశ్వరూపములు నాపు నిన్ను నేఁ
బెట్టెలోని సంచిలోఁ బెట్టి కట్టదా
పట్టమహిషి కౌసల్యాగర్భమున నున్న మేటి
పెట్టెచోటు వైకుంఠముగాఁ బెట్టుకొనవయ్యా
3. అలచరాచరములను నారగించు నీకు నే
వెలయుకుండలోని నైవేద్య మిచ్చెదా
అలమేలుమంగా శ్రీవేంకటేశా మీరిది
వెలయు భక్తవ్వాజుల విందుగాఁ గైకొనవయ్యా

---

ద్విపద॥ ఈకరణి నైవేద్య మింపుగాఁ గొను
శ్రీరాఘవేంద్రుఁడు సీతాసమేతు
యోగాధికృష్ణుఁడై యమ్ముగా నెంచ
నానామృతంబుల చవి నారగించె

రాగం - మంగళకౌశికి. తాళం - ఆది.

ప॥ ఆరగించె నమ్మ నేఁడు శ్రీవేంకటేశుఁడు
అ॥ ఆరగించె నమ్మ నేఁడు ఆంద్ర నందనుని కూడి
సారెసారెకు నెంగిలి చవిఁ జూచి సల్లాపములతోను
1. ఉల్లాసములతోడ గొల్లయువిదలతోఁ జేరుకొని
ముల్లోకమెల్ల నేలు శ్రీమూర్తి పాలు పండ్లు బువ్వము
2. అంతరంగవాసమున నళివేణులొప్పుమీఱ
వింత భక్ష్యభోజ్యముల నేమకఁ బెట్టిన విందు

3. మందయానశ్రీఅలమేలుమంగ వేంకటేశులకు
నందు మోవి తెనియల నమరంబెట్టిన విందు

ఏకవింశాష్టపదీ.

ద్విపద॥ సకలలోకేశుండు జానకీశుండు
ఇకను జానకితోడ నేకాంతమందు
సుఖము పొందునటంచు సూత్కంబు లెఱింగి
సఖులార తెరవేయు సంతోషముగను

[తెరటుపాలుఫలాదులు తాంబూలములో లోపల పెట్టి తెరవేయవలెను.]

రాగం - శంకరాభరణం. తాళం - త్రిపుట.

ప॥ దృష్టిదాఁకు మా యయ్యకు తెర వేయరే
అ॥ దృష్టించెద రెవరైన దరిజేర నియ్యకురే
1. చప్పుడు సేయుట కవసరము గాదనరే
అప్పుడు మజ్జన మాడునని దెల్పరే
కప్పురంబు సురటుల గొలిచెద రనరే
అప్పుడు సతులతోను నారగించినా డనరే
2. దంతపుఁజవికెలో నేకాంత మాడు ననరే
అంతరంగమున నెత్తమాడెద రని తెల్పరే
దొంతిపూల తోట్లలోన దోమిగూడి యున్నాఁ డనరే
చెంత కేళాకూళిలోన జిత్తగించియున్నాఁ డనరే

3. పట్టపురాణియుఁ దాను బవ్వళించియున్నాఁడనరే
రట్టుసేయ నింద్రదేవరైన రానీయకురే
పట్టపు అలమేల్మంగపతి శ్రీవేంకటేశ్వరుఁడు
సృష్టిలోకకరగాన సేవించి పొమనరే

వ్యావింశాష్టపనే.

అలసభుజములు తెరవై చినంతటను
అల మేలుమంగ యూనాదభరితయై
సవరసాలంకార నాదములెనెయ
భువనత్రయఖ్యాతి పొందెనె మెరి
యపరాజసారకాయ లద్భుతంబుగను
తపనకోటిప్రతీకాశప్రతాప
వజ్రవైడూర్యాది రత్నాంకితము
విద్రుంభితాంగైన మెట్లతోనుంచు
మాణిక్యమయవీణ మగువ చేకొని నప్పు
డాణిముత్యపుసరము లాడ నప్పుడొని
మంద్రమధ్యమతారములు గరిగమయనుచు
సుందరంబుగ వీణ సుదతివాయించెన్

రాగం-అహిరి. తాళం-త్రిపుట.

ప॥ వీణవాయించెనే అలమేలుమంగమ్మ-వీణవాయించెనే
వేణుగానవిలోలుఁడైన వేంకటేశులయొద్ద-వీణ

1. కురులుమొల్లన జారఁగ సన్న జా

విరులు జల్లన రాలఁగ
కరకంకణంబులు ఘల్లని మ్రోయఁగ
మరువైన వజ్రాలమురుగు తూలాడఁగ

2. సందిటిదండలు కదలఁగా నాణిముత్యాల
సరు లుయ్యాల లూఁగఁగా
నందమై పాలిండ్ల నలఁదిన కుంకుమ
గంధము చెమటచేఁ గరఁగి ఘుమఘుమనగా

3. ఘననయనములు మెరయఁగా వింతరాగఁ
మును ముదులు గులుకఁగా
ఘననిభవేణి జంత్రగాత్రము మొరయఁగా
వినిపి శ్రీనేం: ఓతులు వీనుల విందుగా

---

కలికి నవ్వు ముక్తికాంతకు సీతమ్మ
ఘలుఘల్లుమని వీణాగాన సొంపుగాఁ జేసి
పరమాత్మునైన తన ప్రాణనాథుని గూడి
సరసంబు సేయఁగ నచ్చి దానందమై
యోగిహృత్పద్మంబులో నున్న పరమాత్మ
యోగనిద్రలు చేయు యుక్తి సేమముగను
జ్యోతిప్రకాశమై జ్యోతియని జ్యోతియై
సర్వమన కల్పితంబు తనమతి నుంచి
నిర్వికారముపొంది నిశ్చంచలంబుగా
ముక్తికాంతను గూడి మోదపుమోద
మవ్యక్తబ్రహ్మానందం బనుభవించైరి

---

## త్రయోవింశాష్టపదీ.

అట్టిసమయము దెలిసి యాసఖిజనులెల్ల
దిట్టముగా జోపాడి జయమనిరియపుడు

రాగం - మధ్యమావతి. తాళం - ఆది.

ప॥ రామలాలి మేఘశ్యామలాలి
తామరసనేత్ర దశరథతనయలాలీ

1. అద్దంపుఁ దొట్లలో నేమొ యనుమానించెదవు
ముద్దుపాపఁడున్నాఁడని ముఖముఁ జూపెదవు

2. శంకలేక బూచీ యంటె ఉలఁగి నవ్వెదవు
పొంకముతో సౌమిత్రిని పొసఁగుతు లేపెదవు

3. అబ్జనయన ఆటలాడి అలసినావురా
బొజ్జలో తలరుగగ నిదురబోవు నిముసము

4. ఎంతో ఎత్తు మరిగినావు ఏమి సేయుదురా
ఇంతుల చేతుల కాకల నీ మే నెంతో కందెనే

5. జోలపాడి జోకొట్టితే ఆలకించెదవు
చాలించితే ఊంకొట్టుచు సంజ్ఞలు జేసేవు

6. సృష్టికి మూలమైన ఆదివిష్ణువు
సంతతము భద్రగిరిస్వామి రాఘవా

రాగం - యదుకులకాంభోది. తాళం - చా.

1. లాలి ఊఁగవయ్యా లక్షణవంతుఁడా
రాజగోపాలుఁడా లాలీ

పాలు వెన్న పెరుఁగు పంచామృతముతోను
ఆరగించిన కృష్ణ లాలీ

2. జడిఁబట్టి కురియఁగ గొడుగు చేఁబట్టి
గోవుల గాచిన కృష్ణ లాలీ
కరి మొరలిడఁగఁ గరుణతోఁగాచిన
కరుణాకటాక్షుఁడా లాలీ

3. ముద్దు మద్దికాయ ముఖమొల్ల వెలిఁగింప
ముద్దులాడెడి కృష్ణ లాలీ
సుందరాంగమును జూచి యిందఱు పొంగెదరు
సుజనావృతుఁడా లాలీ

4. నాగుపామును మెట్టి నాట్యము లాడెడి
నవనీతచోరుడా లాలీ
కొండ నెత్తి నీవు గోగోపుల నిలిపి
చెండ్లాడిన కృష్ణ లాలీ

---

రాగం-మధ్యమావతి. తాళం- చాపు.

ప॥ లాలి భక్తులపాలి కరుణాశాలి లాలి నవమాలి

చ॥ నీరాడు రేవులోఁ జీరలెత్తుక పొన్న
చేరిన బడలిక తీరెను
వారిజాక్షులతోను వనములోఁ దిరిగిన
వనజాక్షుఁడా నీవు లాలి యూఁగవయ్యా

---

రాగం-నీలాంబరి. తాళం-ఆది.

ప॥ లాలీ శ్రీగోపాల లాలీ జగదీశ

2. మేలుకట్లు నీకు మేఘమండల మాయె
మెఱుఁగు జాలరి మెఱు పాయె నుయ్యాల
ఓలి బ్రహ్మాండం బొంగుగనో యని భీతి
నొయ్య నొయ్యన నూఁతు రుయ్యాల
3. పదిలముగ వేదములు బంగారు చేరులై
బట్టబయలై తోఁచు నుయ్యాల
వదలక ధరణీదేవతయుఁ బీఁటబాయె
వర్ణింపఁ దగు నీకు నుయ్యాల
4. కమలయును భూసతియుఁ గదలమోఁకలై నిన్ను
కౌఁగిలింప నూఁతు రుయ్యాల
అనురాగములు నీకు వామభాగమునందు
అందంబుగా నూఁతు రుయ్యాల
5. పాలింపు మెల్లఁగాఁ బన్నగాళి జాఱఁగ
ధాను లిరుగడ నూఁతు రుయ్యాల
కలశైలమునంటి నీ మేను కాంతియు
నిండి వెలిగించు నుయ్యాల
6. కమలాసనాదులకుఁ గన్నుల పండువై
గనుపించరాదు నీ కుయ్యాల
కమనీయమూర్తి శ్రీవేంకటేశ్వరా నీకుఁ
గనువేడ్క లాయె నీ కుయ్యాల

రాగం - నాదనామక్రియా. తాళం - ఆది.

ప॥ ఉయ్యాలయూఁపులు ఓ ముద్దులయ్యా
వెయ్యారు గోపికలు వేడుక నూఁచెదరు

మీఁద నూఁగినవాఁడ లాలీ
ఆనందకమఠమై యమృతమగు తొట్లలో
యమరి యూఁగినవాడ లాలీ

3. గోణంబుతొట్లలో కూటపరాహమై
గునిసి యూఁగిన వాఁడ లాలి
మానవసింహమై గడెపతొట్లలోన
మరగి యూఁగినవాఁడ లాలీ

4. వామనుఁడై చాల త్రిభువనంబుతొట్లలో
నచ్చి యూఁగినవాఁడ లాలీ
రాముఁడై జమదగ్ని యూపుతొట్లలోన
రంజిల్లువాఁడలాలీ

5. ఆమీఁద రాఘవుఁడై పుష్పకపుతొట్ల
నమరి యూఁగినవాఁడ లాలి
మా మరోరకు గొల్లమందతొట్లలో
మరగి యూఁగినవాడ లాలీ

6. తగుబుద్ధరూపమున దయయను తొట్ల లో
తన్ని యూఁగినవాడ లాలీ
పొగడ కల్కియై ధర్మంబుతొట్లలో
పొసగ యూఁగినవాడలాలి

7. తగుఅలమేలుమంగ కాఁగిలితొట్లలో
తగిలి యూఁగినవాఁడ లాలీ
చిగిరించుమని మానసంబుతొట్లమీఁద
శ్రీవేంకటనాథ లాలీ

రాగం - నవరోజ్. తాళం - చాపు.

ప॥ లాలీలాలీ శ్రీకృష్ణ కమలా కాముక మురారే
మాం పాహి కృష్ణ శౌరే

1. జయ నందనరబాల జగదేకమూల
జయ భక్తపరిపాల జయ దయాశీల
జయ వల్లవీలోల జలధరవినీల
జయ సురాహితకాల జయ సదనుకూల

2. నందసుత సరసీరుహనయన గోవింద
కుందకోరకరదన గుస్తను ముకుంద
మందరధరాతులితమహిమగుణబృంద
సుందర మనో మమ హృ నందయ ముకుంద

3. ద్వారకాధిపగ్లానిహరణబిరుదాంక
కరుణాకరసనిదాన కమలాశ్రితాంక
హరవినుతనిజనామ హాటకపీతశంక
పరమపురుష శక్రగురునిరాతంక

4. నిరుపమగుణోదార నిగమాంతరంగ
పరమభావన శ్రితపత్రితవిహంగ
వరవల్లవీపయోధరకలశసాంగ
చర పురో మమ కాంత చరణాభవభంగ

5. శ్రీధర ధరాసమాశ్రితదివ్యచరణ
నాథ లీలాకలితనవనీతహరణ
ఏధయ స్వమకుతుక మిహ సుజనశరణ
మాధవ పురో విహర మామకాభరణ

రాగం - మధ్యమావతీ. తాళం - ఆది.

ప॥ కృష్ణ పాహ్యచ్యుత జిష్ణో పాహి
కృష్ణ వృష్ణికులదీప విష్ణో పాహి

1. అత్యంతసుకుమార సాధుశీల పర
శ్రుత్యంతఖేలన గోపబాలలీల

2. బృందారకమునివంద్యపాద
బృందావనచర వేణురసవినోద

3. సత్యభామాకుచ కుంకుమాంకితాంగ
సత్యకామ సన్నుత పాదగంగ

4. పరమహంస మానసవిలాసహంస
పరమపావన నామ భాసితహంస

రాగం-కమాసు. ఆది. తాళం.

1. లాలిలాలి యనియూచెదరా వన
మాలిమాలి యని యూచెదరా

2. రామరామ యని పాడెదరా-రిపు
భీమభీమ యని పాడెదరా

3. దేవదేవ యని పిలిచెదరా-భూ
దేవదేవ యని-తలంచెదరా

4. రాజరాజ యని పిలిచెదరా-త్యాగ
రాజవినుత యని కొలిచెదరా

రాగం - నీలాంబరి. తాళం - ఝంపె.

1. నారాయణా వాసుదేవ నగధర నారసింహా

శ్రీరామ పూర్ణకామ శ్రీకృష్ణ పవ్వళింపు

2. కరివర కరుణాకర కమలాక్ష గరుడేశ
మరువంపుశయ్యమీఁద మన్నారు పవ్వళింపు

3. కాకుత్థ్సకులనాథ కావేరిరంగనాథ
పాకశాసనవినుత పరమాత్మ పవ్వళింపు

4. గోపికాదధిచోర గోవర్ధనోద్ధార
పాపసంఘవిదార భయహార పవ్వళింపు

5. వేదాంతశ్రుతిసార విశ్వరూపవిహార
మాధవీకుసుమహార మాధవ పవ్వళింపు

6. విదురు నింటికిఁ బోయి విం దారగించితివి
నిదుర పోవయ్య కృష్ణ నిర్మల పవ్వళింపు

7. కమలసంభవనుత కరిరాజవరద శౌరి
విమలకస్తూరిరంగ వేడ్కతోఁ బవ్వళింపు

8. పరమేశ పరమపురుష పరిపూర్ణ భక్తరక్ష
విరులపానుపుమీఁద శ్రీవేంకటేశ పవ్వళింపు

---

రాగం - సౌరాష్ట్రం. తాళం - ఆది.

ప|| పవళింపవయ్య కృష్ణ - పవ్వళింపవే - ఇంత
పాలుబువ్వ నారగించి పవ్వళింపవే

1. పొరిగిండ్లకడకుఁ బోక - బూచి కఱచును
పరువులకు బాఱిబోక - పవ్వళింపవే

2. పరఁగఁ బూతనను జంపి బడలితివి - దాసు
పాలి యో ముద్దుల మురారి పవ్వళింపవే

3. రోల కట్టఁబడి యసురును రై తివి - ఓరీ

బాలుఁడ ముద్దుమురారి పవ్వళింపవే
4. చాల వెన్న పెట్టెదఁగాని చలము మాని - గో
పాలరాయా పసిఁడి తొట్లలోఁ బవ్వళింపవే

రాగం - నవరోజ్. తాళం - చాపు.

ప॥ జోజో దీనజనావనలోలా జోజో యదుకులతిలకా గోపాలా
1. వేదములు రత్నాల గొలుసులై యమర
వేదాంత మకరంజి తొట్లగా నమర
నాదము ప్రణవము పానుపై యమర
ప్రణవార్థమై యిచ్చట పవ్వళింపు స్వామీ
2. అతిచిత్రముగఁ బది యవతారముల బ్రోవ
అమరుచు పదినాల్గు జగములఁ బ్రోవఁ
బ్రబలియుగములను జనియించు మిగుల
ప్రబలి జన్మరహితుఁ డనుకొన్న స్వామీ
3. శాంతియు మణిమయమకుటమై మెఱయ
శక్తులు మహాహారమై మెఱయ
దాంతియుఁ గుసుమమాలికయై మెఱయ
ధరలో శ్రీవేంకటేశ రమణుఁడౌ స్వామీ

రాగం-పున్నాగవరాళి. తాళం-ఆది.

ప॥ జోజోజోజో రే సుముఖా జోజోజోజో రే
రాజీవాక్షా రాధాపక్షా తేజోమయరూపా - జో
1. శిఖిపింఛము లొరయ మోమునఁ జిఱు నవ్వులు మెఱయ
అఖిలాండంబులు తనలోఁ జూపిన యశోదావరబాలా

2. జాగ్రత్స్వప్నసుషుప్తిమూటికి సాక్షియైన రూప
జాగ్రత్స్వప్నసుషుప్తిరహిత సర్వసాక్షిరూప
3. సర్వసాక్షియైన నీవే సర్వాకారములై
సర్వసాక్షియును సర్వరహితమై తానైన సుఖరూప
4. హృదయాకాశపుఁ దొట్లలో నేకాగ్రతపుఁ దెలిపై
సదయాకృతియై శ్యామళదేహ సతతానందఘన
5. రమణీయంబైన యుపనిషత్తొట్లలోనఁ
గమనీయంబౌ తల్పములో మాకాంత పవ్వళింపు
6. దేవకినందగోపాలా వసుదేవపుణ్యఫలా
గోవర్ధనధర గోపీజనమానకుతూహలలీలా
7. వేణుగానలోలా పరివేష్టితగోపాలా
బాణాసురవరనిహా కాలాభాస కనకచేలా
8. ముద్దుగారు మోమును కనుఁగొని ముద్దిడగను గోరి
పట్టగాను పరుగులు పెట్టిరి పవ్వళింపు శౌరి
9. కనుఁగొని కనుచూచి యశోద పలికితొల్లి యూఁగ
మనసారఁగఁ దాననుట లోకమై భావించిన స్వామీ
10. కరుణారససింధు భక్తికామ దాసబంధు
తరుణారుణరుచిరసరసిజపాద వరరుక్మిణీరమణా

రాగం-రీతిగౌళ. తాళం - ఆది.

1. ఆనందఘన జోజో రామా
జోజో రఘుకులతిలకా జోజో కుటిలతరాళక
2. జోజో దశరథబాలా-రామ-జోజో భూజాలోల
3. జోజో రవిశశినయనా-రామ-జోజో ఫణివరశయనా

4. జోజో మృదుతరభాషా-రామ-జోజో మంగళవేషా
5. జోజో నిర్గుణరూపా-రామ-జోజో సుగుణకలాపా
6. జోజో త్యాగరాజా-రామ-జోజో భక్తసమాజా

---

రాగం-నీలాంబరి. తాళం-జంపె.

1. ద్వారకానగరవరే శరదిందుధవళసౌధే
కలితవరాగరుధూపే కర్పూరదీపయుతే
మృగనాభిపరిమళితే మృదుకుసుమాయుతే
మాధవీకుసుమతల్పే మాధవ శేష్వ సుఖం
2. చటులకాళీయమదదమన చాణూరమురమర్దన
నటునత్రిపురహరయుత వాసుదేవ శేష్వ సుఖం
అంగనానుజభరణ ఆనందాంబుధిశయన
కుంకుమాంకితచరణ గోవింద శేష్వ సుఖం
3. సనకాదిమునిగేయ సాకేతపురనిలయ
జనకసుతాహృన్నిలయ జయరామ శేష్వ సుఖం
సురరాజనుతచరణ సురవైరిమనోహరణ
శ్రీరుక్మిణీరమణ జయ కృష్ణ శేష్వ సుఖం
4. గోవర్ధనోద్ధరణ గోపాలభయహరణ
శ్రీవత్సాంకాభరణ చిన్మయ శేష్వ సుఖం
భుజగేశతల్పవర భూదాదిలోకధర
విజయగోపాలవర విశ్వేశ శేష్వ సుఖం

అత్యద్భుతంబుగా - నఖిలేశ్వరుని గోరి
నృత్యంబు లాడి - యానందభరితత్వ మంది

భక్తులను భృత్యులను - జూచి పలుకులు పలికి
వి సరించి యందఱిని వేంచేయుఁ డనిరి

రాగం - నాదనామక్రియా. తాళం - చాపు.

ప॥ వేంచేయ రయ్య మీరు విడిదిండ్లకు
పాంచజన్యధరుఁడు పవ్వళించి యున్నాఁడు

1. గరుడకిన్నరకింపురుషులార సిద్ధ
వరులార విద్యాధరులార
గిరివల్లభులార శరణాగతత్రాణ
బిరుదువేల్పుని నగరు బీగముద్ర లాయె

2. వేదాంబుధులార విబుధగణములార
సనకాదిమునులార ఘనులార
ఆదిత్యులార గ్రహములార దానవ
భేదినగరు తలుపు బీగముద్రలాయె

3. నాగకంకణులార గణనాయకులార
భాగవతులార దిక్పతులార
బాగుగ నలమేలు మంగపతివేంకటేశ్వర
భోగివేల్పు నగరు బీగముద్రములాయె

రాగం - ఆహిరి. తాళం - చాపు.

ప॥ పోరే మీయిండ్లకు ప్రొద్దున లేచి రారే రాముని సేవకు
అ॥ పోరే మీ యిండ్లకుఁ - బొలతులారా రఘు
వీరుని కథలెల్ల - వినరే ప్రొద్దునగాను

1. నీలవర్ణుఁడు మల్లెపూలపానుపుపైని

పాలువూలికతోను - బవళించియున్నాఁడు

2. పదునాల్గులోకముల - బరిపాలనఁ జేసి
నిదుర లేకబడలి - నిద్రించియున్నాఁడు

3. అంతర్యమున మహా - భ్రాంతిఁ జెందిన సీతా
కాంతునితో నే - కాంతమై యున్నది

4. సుందరాకారుఁడు - సుఖియించి యున్నాఁడు
సందడి చేయకు - ఇందువదనలార

5. పరశురాముతో తూము - నరసింహ దాసుఁడు
చరణము లొత్తంగ - శయనించి యున్నాఁడు

---

దింగ్నివేశనం

సర్వకారణుఁడైన - సత్యస్వరూపుఁడు
నిర్వికల్పితమందు - నిద్రింపఁగా నపుడు
అంతరంగము నుండి - యూసఖిజను లెల్ల
సంతోషముగ వచ్చి - సభకు జయవిజయాది
ద్వారపాలకులను - దురుసుగానని మాట
ధీరులై పలికి - దిక్కు రక్షింప

---

1. అయోధ్యానగరే హేమరత్ననిర్మితమండపే
జానకీసహితో రామో యోగనిద్రాయితోభవత్
కావేరీతీరే కమనీయగేహే నవతుళసీవనమాలికే
నవరసయుత దేవనారీచామరమలయానిలవరసేవితే
శ్రీరామచంద్ర స్సీతాసమేత శ్శేతే సుందర శేషశయనే ॥
శ్రీరామరామరామేతి దేవాః ప్రాకారరక్షణం కుర్వంతు ॥

అహో ప్రాగ్ద్వారస్థాః - జయవిజయాదిసర్వేపరమభాగవతోత్తమాః - శ్రీరామచంద్రస్సీతాసమేతో ద్వాత్రింశద్యోజన విస్తృతాయాం - సప్తప్రాకారసహిత షట్త్రింశద్ద్వార సంయుతాయాం - అయోధ్యాయాం - శృంగారవిచిత్రారామాంతర మధ్యే హేమనిర్మితరత్నమండపే - హంసతూలికాతల్పే శేషపర్యంకే-కుసుమశయనే యోగనిద్రామనుభవతి ॥ భవంతోపి-సావధానతయా ప్రాకార రక్షణం కుర్వంతు ॥ అహో భద్రం ॥

2. నాగభూషణసంస్తుత్యో నాగేంద్రవరదః ప్రభుః
భోగిశశయనో రామో యోగనిద్రాయితో భవత్
సనకాదియోగీంద్రతుంబురునారద మునిజనసంస్తుతిసంకులే
దినకరకోటిసమకనకోజ్వలే దివ్యమనోహరమణిమయమండపే
శ్రీరామచంద్ర స్సీతాసమేత శ్శేతే సుందర శేషశయనే ॥
శ్రీరామరామరామేతి దేవాః ప్రాకారరక్షణం కుర్వంతు ॥

అహోదక్షిణద్వారస్థాః చండ ప్రచండాది సర్వేభాగవతోత్తమాః - శ్రీరామచంద్ర స్సీతా సమేతో ద్వాత్రింశద్యోజన విస్తృతాయాం - సప్తప్రాకార సహిత షట్త్రింశద్ద్వారసంయుతాయాం. అయోధ్యాయాం - శృంగారవిచిత్రా రామాంతరమధ్యే - హేమనిర్మితమహామండపే హంసతూలికాతల్పే శేషపర్యంకే కుసుమశయనే యోగనిద్రా మనుభవతి ॥ భవంతోపి సావధానతయా ప్రాకారరక్షణం కుర్వంతు ॥ అహో భద్రమ్ ॥

3. జాజీపున్నాగవకుళ చంపకోత్పలకేసరైః
వికీర్యమాణే శయనే యోగనిద్రాయితో భవత్
సరయూనదీతీరే శరదిందుధవళితే సురభికల్పలతాశోభితే
సురుచిరనవమణిదీపయుతే - సుందరవరదర్పణబింబయుతే

శ్రీరామచంద్ర స్సీతాసమేత శ్శ్వేతే సుందర శేషశయనే ॥
శ్రీరామరామరామరామేతి దేవాః ప్రాకారరక్షణం కుర్వంతు ॥

అహో పశ్చిమద్వారస్థాః - నందసునందాది సర్వేపరమభాగవతోత్తమాః - శ్రీరామచంద్రస్సీతాసమేతః - ద్వాత్రింశద్యోజన విస్తృతాయాం-సప్తప్రాకారసహితషట్త్రింశ ద్ద్వార సంయుతాయాం - అయోధ్యాయాం శృంగారవిచిత్రారామాంతరమధ్యే-హేమనిర్మితమహామండపే హంసతూలికాతల్పే శేషపర్యంకే కుసుమశయనే యోగనిద్రామనుభవతి ॥ భవంతోపి సావధానతయా ప్రాకారరక్షణం కుర్వంతు ॥ అహో భద్రం ॥

4. రామ స్స్వర్ణపర్యంకే భూమిజాసహితో హరిః
కామితార్థప్రదాతా యో యోగనిద్రాయితోభవత్
జాజీచంపకమరువకవన - విభ్రాజితకుసుమసమూహయుతే
రాజితకుంకుమ చందనకళభ - గోరోచన పరిమళవాసితే

శ్రీరామచంద్ర స్సీతాసమేత శ్శ్వేతే సుందర శేషశయనే ॥
శ్రీరామరామరామరామేతి దేవాః ప్రాకారరక్షణం కుర్వంతు ॥

అహో ఉత్తరద్వారస్థాః కుముదకుముదేక్షణాది సర్వేపరమభాగవతోత్తమాః - శ్రీరామచంద్ర స్సీతాసమేతో ద్వాత్రింశద్యోజనవిస్తృతాయాం - సప్తప్రాకారసహిత షట్త్రింశ ద్ద్వార సంయుతాయాం- అయోధ్యాయాం - శృంగారవిచిత్రారామాంతరమధ్యే - హేమనిర్మితమహామండపే - హంసతూలికాతల్పే శేషపర్యంకే కుసుమశయనే యోగనిద్రామనుభవతి ॥ భవంతోపి సావధానతయా ప్రాకారరక్షణం కుర్వంతు ॥ అహో భద్రం॥

శ్లో॥ జయశ్చవిజయశ్చైవ చండఃప్రచండఏవచ ।

నంద శ్చాసౌ సునందశ్చ కుముదః కుముదేక్షణః ॥
సర్వే పద్మపలాశాక్షాః పీతకౌశేయవాససః।
కిరీటినః కుండలినో లసత్పుష్పకమాలినః॥
సర్వేవిముక్తమోహాశ్చ సర్వే చారుచతుర్భుజాః ।
ధనుర్బాణాసిగదా శ్శంఖచక్రభుజాశ్రయాః॥
ప్రహ్లాదాద్యా భాగవతా శ్శృణుధ్వం హరిభక్తితః॥

సాధనచతుష్టయ సంపన్నానాం సద్గురుసంస్తుత దృఢచిత్తా నాం సర్వదేవభజనైకరసానాం సద్గతికైవల్యప్రదాతా - శ్రీరామచంద్ర స్సీతాసమేతో ద్వాత్రింశ ద్యోజనవిస్తృతాయాం- సప్తప్రాకార సహితషట్త్రింశద్ద్వార సంయుతాయాం - అయోధ్యాయాం శృంగారవిచిత్రా రామాంతరమధ్యే హేమనిర్మిత మహామండపే - హంసతూలికాతల్పే శేషపర్యంకే కుసుమశయనే యోగనిద్రా మనుభవతి॥ భవంతోపి సావధానతయా ప్రాకార రక్షణాం కుర్వంతు॥ అహో భద్రం॥

---

భామినిమణు లెల్ల బల్కి మోదముతోను
నామంబు జేసి యానందవారిధి మునిగి
నిశ్చంచలంబుగా నిజభక్తితో నప్పు
డచ్యుతుస నుతియించి యద్భుతంబుగను
శ్రీరామ జయరామ శృంగారరామా
శ్రీజానకీరామ శ్రీపరంధామా
కారుణ్యగుణధామ కల్యాణరామ
గాచి రక్షించుమా కాకుత్థ్సరామా
హే లక్ష్మీ రుక్మిణీ హేసత్యభామ హే

కాలత్రయాతీత కమలాక్షి జానకి
లీలావిభూతికై రా అమ్మ దయయుంచి
మమ్మేలుకో అమ్మ అలమేలుమంగమ్మ
మగువ లందఱు గూడి యీవేళ యని యిట్లు
మనము సంతోషమై మందిరంబులకును
వేంచేశి భక్తితో వేదవేద్యుని తలచి
చాంచల్యమును విడిచి సచ్చిదానసుఖు లైరి
ఆహొద్దు ద్వారపాలకు లందఱు గూడి
రాపు సేయకనే దిక్పతులు నిట్లనిరి

రాగం - పంతువరాళి. తాళం - చాపు.

ప॥ ఓహో యన రయ్యా ఒకసారి - ఇట్టి
సాహసాన తిరుగ రోయి జాటభేరీ
1 కోనేటిరాయఁడు కోరి నిద్రించియున్నాడు
కోనలను తిరుగ రోయి కోటభేరి
వెనకటి వాకిండ్లు బీగముద్రలై యున్నవి
ఘనముగ వాయించ రోయి ఘంటభేరీ
2. తిరుమణిమాడుగులో తిరుగు దేవతలెల్ల
మరువక తిరుగ రోయి మట్టుభేరీ
పరగదేవతలెల్ల బడలికై యున్నారు
ఇరువంక చంద్రసూర్యు లెదురుభేరీ
3. గొలుసులు బంగారుగొలుసులు ఘల్లనగ
కొటగస్తి తిరుగు రోయి ఒకభేరీ
పలుమారు మీరందఱు మూలమూలలను

తలవరులై తిరుగు రోయి తమకుభేరీ
4. శ్రీవేంకటేశుడు చిత్తగించి యున్నాడు
కోవిదులై తిరుగు రోయి కోటభేరీ
ఆవల బంగారుగుడియలు ఘల్లనగ
తావులహనుమంతయ్య తలారిభేరీ.

ఈప్రకారము నాల్గుసారి వాద్యములుఘోషించి భేరివేయుట.

ఘట్టియము.

శ్రీరామచంద్ర స్సీతాసమేతః అయోధ్యాయాం శృంగారవిచిత్రా రామమధ్యే హేమనిర్మితరత్నమండపే యోగనిద్రా మనుభవతి।తత్సమయేఘంటాభేర్యోభవంతు ॥ ఆభాత్ కాబాత్ ఆభూభాజాత్ జనకాత్ జనభోత్ ॥

తన్మయమైనట్టి తత్వప్రకాశమై
చిన్మయాకారమై చిత్ప్రభాభ్యుడై
నాదమై జ్ఞానమై నవ్యప్రభాభ్యుడై
అలరుచు నుండగ అరుణోదయం బెరిగి
హరిహరి యని పలికి ఆవేళ తెలిసి
తుంబురునారదులు వచ్చి బోధంబు జేయుటకు
కోణంగి వేషమై కొనియాడి మాణిక్య
వీణగానము జేసి వేడ్క మీరగ నిలిచి
భద్రాద్రిరాముని బాగుగ నుతిజేసి
నిద్ర లేపించుటకు నియమముతో వెడలెన్ ॥

## కోణంగిదరు.

కోణంగి కోణంగి రాజా రాజా కోణంగి
తిరుగు ఝుహుంతి తేప్పెరుమాళు
అళగు తిరుమలై యాళ్వార్కోవిల్
కోవిల్ తిరుమలై పెరుమాళ్కోవిల్
తిరువారూ త్తేరోట్టం
తకతకతోం తరికిటతోం
ఝుణుకతరికిట తధింగిణతోం ॥

---

1. ఏకమావదొండ్రల్లవ్రొ రంగధామా
నాగమావదు పాంబల్లవ్రొ రంగధామా
2. ఉభయమావదు రెండల్లవ్రొ రంగధామా
అభయమావదు కూక్కురలల్లవ్రొ రంగధామా
3. త్రయమావదు మూండ్రల్లవ్రొ రంగధామా
మాయమావదు పొయ్యల్లవ్రొ రంగధామా
4. చతుర్థమావదు నాన్గల్లవ్రొ రంగధామా
అనర్థమావదు కేడల్లవ్రొ రంగధామా
5. పంచమమావదు అంజల్లవ్రొ రంగధామా
వంచకమావదు విన్నైయల్లవ్రొ రంగధామా
6. షట్కమావదు ఆఱల్లవ్రొ రంగధామా
శుష్కమావదు విఱకల్లవ్రొ రంగధామా
7. సప్తకమావదు ఏళల్లవ్రొ రంగధామా
పుస్తకమావదు ఏడల్లవ్రొ రంగధామా

8. అష్టకమావ దెట్టల్లవ్వో రంగధామా
కెట్టకణ్ణావదు పొట్టక్కణ్ణల్లవ్వో రంగధామా
9. నవమమావదు ఒన్బదల్లవ్వో రంగధామా
భవమావదు సంసారమల్లవ్వో రంగధామా
10. దశకమావదు పత్తల్లవ్వో రంగధామా
మశకమావదు కొశువల్లవ్వో రంగధామా
తిరుకురుఝుణం తధింగణతోం

---

రాగం - యదుకులకాంబోది. తాళం - చాపు.

1. అప్ప దుండే కొండలోన ఇప్పపూల ఏరబోతే
ఇప్పపూలు కప్ప లాయెరా ఓ వేంకటేశ
అప్పులుగల వాని వలనే ఓ వేంకటేశ
2. ఆకాశాన పొయ్యే కాకి మూక జూచి కేక వేశే
మూక మూడు విధము లాయెరా - ఓ వేంకటేశ
దీని భావము నీకే తెలుసురా ఓ వేంకటేశ
3. అహోబిలయ్య గుంటలోన వ్రాల్యలు ఉదుక పోతే
వ్రెల్యలెల్ల మల్లె లాయె - ఓ వేంకటేశా
దీని భావము నీకే తెలుసురా ఓ వేంకటేశా
4. అహో బిలాన చెట్టు బుట్టే భూమియెల్ల తీగ పారే
కంచిలోన కాయ కాచేరా - ఓ వేంకటేశా
శ్రీరంగాన పండు పండేరా- ఓ వేంకటేశా
5. పుట్టమీద చెట్టు బుట్టే భూమియెల్ల తీగ పారే
పర్వతాన పండుపండే రా - ఓ వేంకటేశా
అంద వచ్చు కోయ రాదు రా - ఓ వేంకటేశా

6. చేయిలేని వాడు కోశే - నెత్తిలేని వాడు మేశే
కాళ్లు లేని వాడు నడచే - ఓ వేంకటేశా
పెదవిలేనివాఁడు చిలుక తినేరా ఓ వేంకటేశా

7. గుంట యెండి పండు పండే - పండు కోశి కుప్పవేశే
కుప్పకాలి యప్పు తీరేరా - ఓ వేంకటేశా
దీని భావము నీకే తెలుసురా ఓ వేంకటేశా

8. సందేకాడ తలవ్రాలు - సంధిదీరి వేంకటరాయా
తెల్లవార నాయ నీడరా - ఓ వేంకటేశా
దీని భావము నీకే తెలుసురా ఓ వెంకటేశా

9. ముత్యాలపందిటిలోన ముగ్గురు వేంచేశి రాగ
ముక్కంటిదేవుని జూచేరు ఓ వేంకటేశా
దీని భావము నీకే తెలుసురా ఓ వేంకటేశా

10. ఏటిలోన వల వేశే తాటిమాను నీడలాయె
దూరపోతే చోటులేదురా ఓ వేంకటేశా
దీని భావము నీకే తెలుసురా - ఓ వేంకటేశా

11. ముందు కూతు రాలు ఆయె నుందు ఆలు కూతు రాయె
పొందుగా పెండ్లాము తా నాయె ఓ వేంకటేశా
దీని భావము నీకే తెలుసురా ఓ వేంకటేశా

12. ఆకు లేని అడవిలోన - మూడులోకల పెద్ద పులిని
మేక యొకటి యెత్తి మింగేరా - ఓ వేంకటేశా
దీని భావము నీకే తెలుసురా - ఓ వేంకటేశా

13. పున్నమ వెన్నెలలోన వన్నెలాడితోనుగూడి
కిన్నర మీటుచు పొయ్యేవు ఓ వేంకటేశా
దీని భావము నీకే తెలుసురా- ఓ వేంకటేశా

14. అర్ధరాత్రివేళలోని రుద్రవీణ నెత్తుకొని
నిద్రించిన నిన్ను పాడగ - ఓ వేంకటేశా
దీని భావము నీకే తెలుసురా ఓ వేంకటేశా

## చతుర్వింశాష్టపదీ.

### భగవత్ప్రబోధనం.

శ్లో॥ జయజయజయ దేవ దేవ దేవ త్రిభువనమంగళ దివ్యనామధేయ।
జయజయజయ బాలకృష్ణ దేవ శ్రవణమనోనయనామృతావతార॥

2. ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద ఉత్తిష్ఠ గరుడధ్వజ।
ఉత్తిష్ఠ కమలాకాంత త్రైలోక్యం మంగళం కురు॥

3. ఉత్తిష్ఠోత్తిష్ఠ దేవేశ ఉత్తిష్ఠ వృషభధ్వజ।
ఉత్తిష్ఠ గిరిజాకాంత త్రైలోక్యం మంగళం కురు॥

4. కౌసల్యాసుప్రజా రామ పూర్వాసంధ్యా ప్రవర్తతే।
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవ మాహ్నికం॥

5. వత్స జాగృహి విభాత మాగతం
జీవ కృష్ణ శరదాం శతం శతం।
ఇత్యుదీర్య సుచిరం యశోదయా
దృశ్యమానవదనం భజామహే॥

6. సీతాదత్తకరాంబుజం పదయుగశ్లిష్యన్మణీపాదుకం
హార్దాపేక్షవిహారబర్హ్యుపసృతాభ్యర్ణంచదోర్ధార్గ్యగవా।
స్వామిన్నేవజయేతిపంజరశుకస్వానోల్లసత్తోరణం
సాకేతాధిపతేరుపస్యవతునశ్శయ్యాగృహాన్నిష్క్రమః॥

7. బాలం నీలాంబుదాభం నవమణివిలసత్కింకిణీజాలబద్ధ
శ్రోణీజంఘాంతయుగ్మంవిపులరురునఖప్రోల్లసత్కంఠభూషం।
ఫుల్లాంభోజాభవక్త్రం హతశకటమరుత్పూతనాదింప్రసన్నం
గోవిందంవందితేంద్రాద్యమరవరమజంపూజయేద్వాసరాదౌ॥

8. కలక్వణితకంకణం కరనిరుద్ధపీతాంబరం
క్రమప్రసృతకుంతళం గళితబర్హభూషం విభోః।
పునః ప్రకృతిచాపలం ప్రణయినీభుజాయంత్రితం
మమ స్ఫురతు మానసే మదనకేళిశయ్యోత్థితం॥

9. తత్కైశోరం తచ్చ వక్త్రారవిందం
తత్కారుణ్యం తే చ లీలాకటాక్షాః।
తత్ సౌందర్యం సా చ మందస్మితశ్రీస్
సత్యం సత్యం దుర్లభం దైవతేషు॥

10. తేజసేస్తు నమో ధేనుపాలినే లోకపాలినే।
రాధాపయోధరోత్సంగశాయినే శేషశాయినే॥

11 పాణౌ పాయసభక్తమాహితరసం బిభ్రన్ముదా దక్షిణే
సవ్యే శారదచంద్రమండలనిభం హైయంగవీనం దధత్।
కంఠే కల్పితపుండరీకనఖ ముద్యద్దామదీప్తిం వహన్
దేవో దివ్యదిగంబరో దిశతు నస్సౌఖ్యం యశోదాశిశుః॥

12. ప్రాతస్ స్మరామి దధిఘోషవిధూతనిద్రం
నిద్రావసానరమణీయముఖారవిందం।
హృద్యానవద్యవపుషం నయనాభిరామ
మున్నిద్రపద్మనయనం నవనీతచోరమ్॥

13. విదగ్ధగోపాలవిలాసినీనాం
సంభోగచిహ్నాంకితసర్వగాత్రం।

పవిత్ర మామ్నాయ గిరా మగమ్యం
బ్రహ్మ ప్రపద్యే నవనీతచోరం ॥

14. జానుభ్యా మపి ధావంతం పాదాభ్యా మపి సుందరం ।
సకుండలాలకం కృష్ణం ధ్యాయా మ్యుషసి బాలకం

15. ఉద్గాయతీనా మరవిందలోచనం
వ్రజాంగనానాం దివమస్పృశ ద్ధ్వనిః ।
దధ్నశ్చ నిర్మంథనశబ్దమిశ్రితో
నిరస్యతే యేన దిశా మమంగళం ॥

---

రాగం - దళాక్షరీ. తాళం - త్రిపుట.

ప॥ నిదుర మేల్కొన వయ్య - గోపాలశౌరే - నిదుర

అ॥ నిదుర మేల్కొన వయ్య - నీలమేఘశ్యామ
అదుగో జూడ వయ్య - అరుణోదయ మాయె ॥

1. గోపికావల్లభ - గోవర్ధనోద్ధార
గోపకుమార శ్రీ - గోపాల
మాపాల నెలసిన - మాధవ గోవింద
శ్రీపురుషోత్తమ - శ్రీనివాస దేవ

2. అచ్చిక లేలయ్య ఆర్తరక్షక శ్రీ
వారి కేశవ జనార్దన
చిచ్చు మ్రింగిన గొల్ల శిశువుల గాచిన
అచ్యుతానంతా కళంకస్వరూపా

3. బాలికామణు లిండ్ల పాలు వెన్న పెరుగు
బావుకొన్న వేణుగోపాల

బాలకుమారుడై పసిడి తొట్లలోన
బడలిక దీర పవ్వళించిన శౌరి-నిదు

---

రాగం - భూపాళం. తాళం - చాపు.

ప॥ నిదుర మేల్కొనవయ్య శ్రీరామ నిదుర
అ॥ నిదుర మేల్కొన వయ్య నీరజలోచన
కదనవిజయ కోదండము చేకొమ్ము
1. అమరకోటు లెల్ల అసురుల భయముచే
అఖిలతీర్థము తెచ్చి అభయమడిగెదరు
సమరవిజయుడవై సరగున మజ్జనము
సలుపను నిది మంచి సమయము వేగ లెమ్ము
2. నారదమునులాది సద్బ్రహ్మర్షులును
బారుగా నిలిచి ప్రస్తుతించెదరు
నీరజలోచన నిగమగోచర దేవ
క్షీరాబ్ధిశయన యో శీఘ్రముగ లెమ్ము
3. అంగదజాంబవద్ధనుమద్విభీషణులు
చెంగట ముదముతో సేవించుచున్నారు
శృంగారములు గులుకు సీతాసమేతుడై
మంగళముల నిమ్ము మానవోత్తమ లెమ్ము

---

రాగం - భౌళి. తాళం - జంపె.

ప॥ మేలుకో అయ్య మమ్మేలు కోరామ
అ॥ మేలైన సీతాసమేత నా భాగ్యమా
1. నారదాదులు నిన్ను కోరి నీ మహిమలను

వారిగా బాడుచున్నా రిపుడు తెల్ల
వారగా వచ్చినది శ్రీరామ నవనీత
క్షీరములు బాగుగా నారగింపను వేగ

2. ఫణిశయన అనిమిషరమణు లూడిగము సేయ
అణకువగ నిండారు ప్రణుతి జేసెదరు
మణిమయాభరణములై యణిమాదు లిడు నీప
మణులు తెలుపాయెను తరణివంశవరతిలక

3. రాజరాజేశ్వర భరాజముఖ సాకేత
రాజ సద్గుణ త్యాగరాజనుత చరణ
రాజన్యవిబుధగణరాజాదు లెల్ల నిను
పూజింప గాచినార జగము నేలింప

---

రాగం - సౌరాష్ట్రం. తాళం - రూపకం.

ప॥ మేలుకో దయానిధీ - మేలుకో దాశరథీ
అ॥ మేలుకో దయాపనిధీ - మిత్రోదయమైన వేళ

1. నారదాదిమునులు సురలు నీరజభవ సిందుకలా
ధారులు నీ సన్నిధి కోరి కొలువుగాచినారు

2. వెన్నపాలు బంగారుగిన్నెల నే నుంచినాను
తిన్నగా రగించి తేట కన్నులతో నన్ను జూడ

3. రాజరాజాదిదిగ్రాజు లెల్ల వచ్చినారు
రాజనీతి తెలియ త్యాగరాజవినుత నన్ను బ్రోవ

---

రాగం - భూపాళం. తాళం - చాపు.

1. రంగనాయక రాజీవలోచన - రమణ తెల్లవారె వేగా
సంగతిచే కంకణరము నాపయ్యెద - కొంగు తగిలించినది లేరా

2. కొమ్మలుబంగారు కుండలో పన్నీరు-కొని వచ్చియున్నారు లేరా
సమ్మతితో మజ్జన మాడరానీవు - కమ్మ కస్తూరిదిద్దెను లేరా
3. కురులు నున్నగదువ్వి కొండెయు జడవేసి-విరులసరుల జుట్టె లేరా
తిరముగ నీముద్దుమోమున గురుతులు-తీర్చుకొందుగాని లేరా
4. కలకంఠులు తాళగతుల నాట్యమాడి కొలువ వచ్చినారు లేరా
కళలంటి మునుగోపకాంతల గూడిన-కలువరింతలు మాని లేరా
5. తమ్మికొలకులను తుమ్మెదపంక్తులు-కమ్ముకొన్నవి లేరా
ఇమ్మైన ఈరేయి బడలి కెల్ల దీర-ఇరవొంద విసరెను లేరా
6. పరుపడీ నీ దివ్య ఉరము పంపు నుంచి-పరిమళ ములదెర లేరా
పరిపరి విధముల పసిడి వీణె మీటి-పాడి మెప్పించెద లేరా
7. పువ్వులచే నిన్ను పూజించ పొగడెను-బుధులు వచ్చినారు లేరా
అన్న తెచ్చిన కొట్టి ఆన్నాలు నెన్న-ఆరగించు స్వామి లేరా
8. అంగరంగవైభోగరంగమ్మ-అరుణోదయ మాయె లేరా
పొంగలి దధ్యోదన మారగించను-పుణ్యాదనాథ లేరా
9. కులుకుగుబ్బలమున్న కొమ్మగొప్ప గుమ్మిన-గోపి ల్వచ్చిరి లేరా
అలమేల్మంగ వేంకటపతి దాసుల-ఆదరింప వేగ లేరా
10. లేరా నా యయ్య లేరా నా స్వామి-లేరా తెల్లవారె లేరా
లేరా ఉభయకావేరితీరవాస-శ్రీరంగనాయక లేరా

---

రాగం - భూపాళం. తాళం - చాపు.

ప॥ శ్రీరామచంద్ర శ్రీకౌసల్యానందన-ధీర తెల్లవారె లేరా
వారిజలోచన సౌమిత్రితో సంధ్యా-వందనము సేయ లేరా
1. భారద్వాజంబులు బోధరసంబుతో-వలుకుచున్నవి లేరా
వారిజమిత్రుడు ఉదయాచలమందు-వచ్చుసమయమాయె లేరా

2. స్త్రీలుబంగారుకడవలో పెరుగు-చిలుకుచున్నారు లేరా-తమ్మి
పూలు వికసించు సమయ మాయె-పురుషసింహ లేరా
3. కోలాహలంబుతో కుక్కుటంబులు-కూయుచున్న వి లేరా
చాల ముదముతో చక్రవాకంబులు-చలుపుచున్నవి లేరా
4. చక్కగ తుమ్మెదలు ఝుంకారధ్వనులు-చలుపుచున్నవి లేరా
అక్కఱతోడనే విప్రులు వచ్చెదరు-ఆహ్నికంబు సేయ లేరా
5. కంకణగజ్జెలు ఘల్లన నీళ్లతో-కాంతలు వచ్చెదరు లేరా
వేంకటకవిని రక్షించేటి శ్రీ-విజయరాఘవ లేరా

రాగం - భూపాళం. తాళం - త్రిపుట.

ప॥ మేలుకో నవనీతచోరక మేఘకోమలవర్ణ గిరిధర
మేలుకో సింహాద్రినాయక మేలుకొనవే హరే

1. తెల్లవారెనుతూర్పుదిక్కున తెమలితిమిరముగుహలుచొచ్చెను
మెల్లమెల్లన విరిసె కమలము లోదిగే కలువలను
మొల్లవిరులకు తేటికదుపులు మునసి ఝుమ్మనిమ్రోత లెసగగ
తెల్లనాయెను దీపకళికలు తేజు మలగెను
2. పద్మమిత్రుడు ఉదయగిరిపై పయనమై యేతెంచి వచ్చెను
పద్మసంభవుడాదిగాగల పరమమునివరులు
పద్మముల చెంగల్వ విరులను పరగి మిమ్ము పూజింప వచ్చిరి
పద్మసంభవరుద్ర సన్నుత ప్రణత మేలుకొనవే
3. గంగ గౌతమి యమున నర్మద తుంగభద్ర కృష్ణవేణియు
రంగవాహినియైన కావిరి రమ్యమగు నదులు
పొంగి నీ పదమందు గల్గిన పుణ్యతీర్థము లెల్ల తెచ్చిరి
మంగళప్రదమైన మీ ముఖమార్జనమునకు

4. గరుడవాసుకియక్షకిన్నరగంధర్వులు కింపురుషు లందఱు
సురలు మొదలైనవారులు ప[illegible]తాదులను
పరమముని శుకనారదులు ప[illegible]భక్తులంద ఱిపుడు
కరుణ వేడుచు వచ్చి ద్వారమ[illegible]చి యున్నారు
5. భావశుద్ధిగా ద్వారపాలకు లివ్విధం[illegible]
దేవదేవ యోగ నిద్రఁ దెలిసి మేల్కొనవే
శ్రీవెలయు,సింహాద్రిలో నరసింహామూర్తియో లేచి కరుణతో
సేవకుల కభయము లొసగుము చిత్త మలరగను

---

రాగం - భూపాళం. తాళం - చాపు.

1. సుప్రసన్నోభవ సుదతీబృందవర
నయనేందీవర రాజిత గోవింద
అప్రమేయ భక్తబంధహరణ నంద
హాసశోభితముఖాబ్జ ముకుంద
2. నారదాది మునిగేయ నామధేయ
నందయశోదాభాగ్యమహోదయ
పారిజాతమూలనిలయ నీలకాయ
పాండవేయగేయ పద్మాసహాయ
3. కమలకులిశధ్వజకలశాదిలాంఛిత
కామినీకుచతటకుంకుమరంజిత
విమలమునిహృదయవిలసత్పాతపద్మ మిాశ
విధేహి కృష్ణ మమ శిరసి మన్నాథ
4. తద్ధిమిధిమిధిమి తొంగుణాంగుతక్క
ఝుంతా రేకుతక్క ధే కుణాంగుతక్క

మత్తగోపసుందరీసహస్రావృత
నటనచతురవర నానావతార

5. మధుమురనరకమహాసురమర్దన
మాధవ గోకులశరణ జనార్దన
విధువంశపాలన విహగేశవాహన
విశ్వవిమోహన వేదాండభవన

6. బాణబాహుబృందకృంతనవరలీల
బలదేవానుకూల పద్మారి కులకాల
వేణుగానలోల విశదకీర్తిజాల
విబుధవినుతశీల విజయగోపాల

---

రాగం - మలహరి. తాళం - జంపె.

ప॥ హే రామ హే కృష్ణ ఇహ సముత్తిష్ఠ

అ॥ హే రామ హే కృష్ణ హే జగత్త్రియగురో
హే పుండరీకాక్ష రక్ష నిజపక్షం

1. ప్రాచీదిగంగనా పరిహసతి హే కృష్ణ
పతియోగపరమసౌభాగ్యమహితా
ప్రాచీన వైరస్య మభినయం త్యక్త్వా సా
ప్రతీచీం దిశం రామ కామముదితా

2. నళినముకుళోదరవిదళనగళితాళయో
లలితతరరవి నిహ్నుతాంధతిమిరాః
మిళితనవనళినపరిమళబహుళమకరంద
కలనయా విచరంతి కామముఖరాః

3. దధిమథనసంజాతమధురతరసంగీత

బుధజనాగమఘోషరమ్యఘోషం
మధుమథన సంకలయ మాధవ విధీంద్రనుత
పదకమల పద్మాకృతాభిలాషం
4. భూపాళ దేశాక్షి దేవగాంధారి శుభ
బిలహరీవసంతముఖరాగబృందం
గోపికా గాయంతి గోవింద తవ తు శుభ
గుణరత్నభూష మానందకందం
5. కలితనవమల్లికాకుసుమాని విహసంతి
కామ మిహ తారకా బృంద ముషితం
లలితవచ సాంద్రకారకలిత మితి గుణభక్త
నారాయణానందతీర్థరచితం

రాగం - భూపాళం. తాళం - జంపె.

ప॥ శ్రీవేంకటేశ రాజీవాక్ష మేలుకోవే
వేగ వేగ మేలుకొను వెలిఛాయలు లమరే
1. సురలు గంధర్వకిన్నరులెల్ల గూడితిం
బురశ్రుతులను జేర్చి సరవిగాను
అరుణోదయము దెలిసి హరిహరి యనుచు సర
హరి నిన్ను దలచెదగు హంసస్వరూప
2. అలచిలుక పలుకులకు నధరబింబము బోలె
తెలివి దిక్కుల మిగుల తేటబారే
అలరు కుచగిరుల నుదయాస్త్రాద్రిపై వెలిగె
మలినములు తొలగ నిదో మంచు తెరవిచ్చె
3. తళుకొత్త నిందిరా తాటంక రవిరుచుల

వెలిగన్ను తామరలు వికసింపగాను
అలర్మేల్మంగ శ్రీ వేంకటాచలరమణ
చెలువు మీఱగను ముఖకళలు గన వచ్చె

---

రాగం - భూపాళం. తాళం - చాపు.

ప॥ మేలుకొనవే శ్రీలక్ష్మి మేలుకొనవే
అ॥ మేలుకొనవే భక్తపాలనము సేయుటకు
మేలుకొనవే నన్ను కన్న తల్లి
1. మేలుకో శ్రీదేవి మేలుకో భూదేవి
మేలుకో సామ్రాజ్య మిచ్చు లక్ష్మి
మేలుకో అలమేలుమంగమ్మ మాయమ్మ
మేలుకొని లోకముల పాలింపు నమ్మ
2. చందన కస్తూరి జాజులు విడెముల
నందుకొని నీ కొసగి పొందుబరచి
కందర్పకోటిహరి కలశీయుండిన నేటి
పొందుగ సేవకు ప్రొద్దాయె నమ్మ
3. కద్రుతనయాంక హరి కౌగిటను నెందాక
నిద్ర పోయ్యెద నమ్మ నిఖిలజననీ
పద్మములు వికసించె భ్రమరములు పైమెాగ
అద్రివేంకటరమణు సన్నిధియందు

---

రాగం - సౌరాష్ట్రం. తాళం-చాపు.

ప॥ జేరి వచ్చెను అలమేలుమంగ
జిలుగు పయ్యెద జారగ

అ॥ గారవమ్మున వేంకటపతి పడకిల్లు
తీరని ప్రేమతో తిరిగి జూచుకొంట

1. ముడిపూలు రాలగ ముంగురుల శ్యామ
విడెముకప్పుర తావి వెదచల్లగ
ఒడలు వాడుదేర ఒంటికట్టుతోను
పడతి రవలగిల్కు పావలమెట్లతో

2. నికరంపు జవ్వాజి నిగ్గుల కస్తూరీ
యగరుకుంకుమగంధ మందుకొని
మగున మోము నిదుర మబ్బు తేరగాను
నొగిలిన కెమ్మోవి నొక్కులతోడను

రాగం - బిలహరి. తాళం - జంపె.

ప॥ హెచ్చరిక మాం పాహి - ఇనకులోద్భవ రామ
హెచ్చరిక వైదేహి - హృదయాబ్ధిసోమ

1. దేవతలు దిక్పతులు దినకరుడు సనకాది
సేవకులు సాధ్యవసుసిద్ధచారణులు
భూనరులు మునివరులు భోగీంద్రశయనుడా నీ
సేవ జేయ వచ్చిరయ్య సర్వజ్ఞమూర్తే

2. కిన్నరులు కింపురుషగరుడరుద్రాదులును
పన్నగులు విబుధగుహ్యాపరమభాగవతులు
సన్నుతించెదరు నీవే సత్యస్వరూపుడని
విన్నవించెద రయ్యా వేదాంతవేద్య

3. తరుణిమణి జానకితో తత్వార్థగృహమందు
వరుసతో నిద్రించు వాఙ్మనోతీతా

కరుణాకటాక్షా శ్రీకాకుత్స్థ తిలకా
అరుణోదయం బాయె ఆనందకందా
4. కోసలాధిపుడైన కోదండపాణి నిను
భాసురాంగులు కోరి భరతంబు లాడ
దాసులను పాలించు దయతోను భద్రగిరి
వాస శ్రీ వనమాలి వైకుంఠవాస

శ్లో॥ ఏవం సంప్రార్థితః శ్రీమా న్సమ్యగుత్థాయ కేశవః
రత్నసింహాసనే దివ్యే రరాజ సురాశిప ॥

తెరతీసి శర్కరాన్నైవేద్యంచేసి కర్పూరహారతి యెత్తుట.

రాగం - దేశాక్షి. తాళం - జంపె.

ప॥ అదుగో కొలువై యున్నాడు - అలమేలుమంగపతి
పదివేల విధములను నాగుపత్తెము జేయుచు
1. రంగమంటపములో - రత్న సింహాసనముపై
అంగనామణులతో - అమర వేంచేసి
బంగారు పావడలు - పసరించి ముంగడల
శృంగారముగ సురలు - సేవ సేయగను
2. వెండిబైడిగుదియలను - వేత్రహస్తులు పొగడ
నిండు వెన్నెలపూల - దండ లమర
వాలింకిగను కానుకల - నొనర లెక్కలు జేయ
దండి మీఱగ నిపుడు - దేవరాయడు చెలగి
3. అంగరంగవైభవముల - రంగుగా చేకొనుచు
మంగళహారతుల-మహిమ వెలసి

శృంగారమైనట్టి మా - శ్రీవేంకటాధిపు
డంగనలు కొలువగా-నిపుడు వేంచేసి

---

రాగం - సౌరాష్ట్రం . తాళం - ఆది.

ప॥ వీడె నెలకొన్నాడు శ్రీవేంకటగిరిమీద
వీడె కౌరవుల పాలిటికి విశ్వరూపు డితడు
1. త్రిపురంబులపై వ్రాలిన యా ఘనతీవ్ర బాణ మితడు
చపలపు బాణుని మర్మభేదియగు చక్రధరు డితడు
విహితము కంబములో వెలసిన వీరసింహ మితడు
కపటపు భస్మాసురుని పాలిటికి కాలదండ మితడు
2. ధరణికింద బలి నణచిన యా పాతాళభేరి యితడు
పరశురాముని గర్వము నణచిన ప్రళయవాయు వితడు
ఒరసిన నరకాసురుని పాలిటికి ఉరుమని పిడు గితడు
దురమున నెదిరిన దనుజకోటులకు ధూమకేతు వితడు
3. అదుగో విధిరుద్రాదుల కెల్లను ఆగమూల మితడు
పదిలముగా తను గొలిచిన వారికి పారిజాత మితడు
కదలని యా బ్రహ్మాండకోటులకు కన్నతండ్రి యితడు
వెతకి వెతకి తా వరము లొసంగెడి వేంకటపతి యితడు

రాగం - దేవగాంధారి. తాళం - ఆది.

ప॥ కొలువై యున్నాడే కోదండపాణి
అ॥ సలలితమతులై సారెకుశీలులై తలచుచు కోరివచ్చి సేవింపగ
1. జనకజభరతాదులతో మంచి - నైవేద్యంబుల
చనువున వేడుక నారగించి - మెఱుపుకోట్ల గేటి

కనకపటము సొమ్ములను ధరించి - వేదోక్తమైన
సనకవచనములచే తోషించి శ్రితుల పోషించి

2. పరమగు వాసనలు పరిమళింప - సన్నిధిలో వెలుగుచు
సురవారసతులు బాగ నటింప - అదిగాక పరా
శరనారదమును లెల్ల నుతింప - ఎంతెంతో నెనరున
సురపతివాగీశులు సేవింప - మేను పులకరింప

3. ఉడురాజముఖుడు శేషశయ్య - పైని చెలంగగ కని
పుడమికుమారి సుగంధము పూయ - నమ్మినవారలకే
కడగంటిని కోరిన వర మీయ - త్యాగరాజు నెనరున
అడుగడుగుకు మడుపులనందీయ - శ్రీరామయ్య

రాగం - నటభైరవి. తాళం - ఆది.

ప॥ కొలువైయున్నాడే కోదండపాణి

అ॥ తొలి కర్మ మణగ జూతాము రారే
తోయజారి రోహిణి గూడిన రీతి

చ॥ మనసురంజిల్ల సురసతులు అణి
మాదులు కొలువ వెయివన్నె
కనకశలాకను గేరు సీతా
కాంతతోను త్యాగరాజవినుతుడు

కర్పూర హారతి.

రాగం - కోణంగి. తాళం - ఆది

ప॥ కోణంగి కోణంగి - కోణంగ్యారే కోణంగి

చ॥ గోవిందా యను - గోపాలా యను

వేణుగానము బహు - జాణతనము - ఆడాడు
కడుపుల బెట్టె - వేడుకోరా - విధిహరిహరుల
తిమ్మప్పయను - నమ్ము తిమ్మా - నమ్ము దేవుని
నారాయణాయను - నావంకకురా - నన్ను తెలుసునా
శ్రీవేంకటపతి - భావన గనరా - త త్తతధింగణతోం

---

రాగం - దేశాక్షి. తాళం - జంపె

ప॥ గ్రహఫలము మీ యనుగ్రహఫలము మాకు
సహజ మిది నరసింహాచలనివాస

1. దిక్కులలరెడి మేను తేజమే రవిఫలము
చక్కని నీ ముఖకళలు చంద్రఫలము
చొక్కమగు నయనముల జూపే తారాఫలము
మక్కువలరగ మూర్తి మంగళుని ఫలము

2. ఇరవొందగా మిమ్ము యెఱుగుటే భుదఫలము
గురులుకును గురుడవుట గురువు ఫలము
పరగ మిము భజియించి బ్రతుకుటే భృగుఫలము
సరిలేని నీ మాయ తొలగినది శనిఫలము

3. భావింప మీ చిలువపానుపు రాహుఫలము
కేవలము మీ పడగ కేతుఫలము
శ్రీవెలయుసింహాద్రిధామ నరసింహ
నీ వైభవము మాకు నిత్యఫలము

---

రాగం . ధన్యాశి. తాళం - ఆది

ప॥ జానకీమనోహరాయ - జయమంగళం

పవనసూనుహితకరాయ - శుభమంగళం

1. మకరకుండలయుగళ మండితగండస్థలాయ
చకితమునిశరణ్యాయ జయమంగళం
అకళంకశశాంకసన్నిభాననాయ జలదనీల
సుకుమారశరీరాయ శుభమంగళం

2. గర్వితరావణకుంభకర్ణవిద్రావణాయ
సర్వలోకశరణ్యాయ జయమంగళం
గీర్వాణవందితాంఘ్రియుగళాయ సంజ్ఞాన
చక్షుర్ద్వివ్యస్వరూపాయ శుభమంగళం

3. జలజతుల్యమణిసింహాసనమధ్యసంస్థితాయకో
సలనగరనిలయాయ జయమంగళం
జలజదళలోచనాయ శబరీవరదాయ భక్త
సులభాయ శ్రీరామాయ శుభమంగళం

---

రాగం - పున్నాగవరాళి. తాళం - జంపె.

ప॥ జయమంగళం - నిత్య శుభమంగళం

1. కస్తూరికాతిలక శోభితముఖాబ్జాయ
కమనీయ శిఖిపింఛ లాంఛితాయ
నిస్తులమనోజ్ఞ తరమౌక్తికాభరణాయ
నిగమాంతవినుతపదపంకజాయ

2. సాకేత నిలయాయ సనకమునిపూజ్యాయ
సరయూనదీతీరవిహారణాయ
రాకేందువదనాయ రమ్యగుణ నిలయాయ
రాజాధిరాజాయ రాఘవాయ

3. భుజగేంద్రశయనాయ పుష్పేషుజనకాయ
పురుహూతతనయరథభూషణాయ
గజరాజభయహరణకమనీయరూపాయ
విజయగోపాలాయ విధినుతాయ

రాగం - సురటి. తాళం - చాపు

ప॥ విజయగోపాల తే మంగళం - జయ
విశ్వంభర తే మంగళం
1. నందయశోదానందన సుందర
మందస్మిత ధృతమందర
నందసునందాదినుతపాదార
విందగోవింద తే మంగళం
2. చందనచంపకతులసీకల్పక
శీతలవనసంచారిణే
వాచామగోచరచరిత సదానంద
వాసుదేవాయ తే మంగళం
3. చారుకదంబకతరుమూలాశ్రిత
చంచలమణిమయకుండల
దారుణవైరిసంహరణపరాక్రమ
దాసపోషణ తే మంగళం
4. గోపీమండలగూఢ పరానంద
గోవింద గోకులనాయక
ఆపదుద్ధారకాఖిలజనాధార
తాపహరణ తే మంగళం

5. వర్ధితగోబృంద వనమాలి న్గో
వర్ధనగిరిధర వామన
తీర్థకృత శివనారాయణ
తీర్థమానససారసమందిర మంగళం

రాగం - గౌళి. తాళం - ఆది.

ప॥ జయమంగళం నిత్యశుభమంగళం
1. మంగళంరుక్మిణీరమణాయ శ్రీమతే
మంగళం రమణీయమూర్తయే తే
మంగళం శ్రీవత్సభూషాయ శార్‌ఙ్గిణే
మంగళం నందగోపాత్మజాయ
2. పూతనాకంసాదిపుణ్యజనహారిణే
పురుహూతాదిముఖదేవహితకరాయ
సూతాయ విజయస్య సుందరముఖాబ్జాయ
శీతకిరణాదికులపావనాయ
3. కాళీయమౌళిమణిరంజితపాదాబ్జాయ
కాలాంబుదశ్యామదివ్యతనవే
కారుణ్యరసవర్షినయనారవిందాయ
కల్యాణగుణరత్నవారినిధయే
4. నవనీతచోరాయ నందాదిగోపగో
రక్షిణే గోపికావల్లభాయ
నారదమునీంద్రసన్నుతనామధేయాయ తే
నారాయణానందతీర్థగురవే

భాగవతులకు గంధపుష్పాదులిచ్చి గ్రామప్రదక్షిణముజేయుట.

రాగం - యమునాకల్యాణి. తాళం - ఆది.

ప॥ హరిదాసులు వెడలే ముచ్చట కని
ఆనంద మాయె - దయా॥

అ॥ హరి గోవింద నర-హరి రామ కృష్ణ యని
వరుసగ నామము - గరుణతో జేయుచు

1. సంగతిగాను మృ-దంగ ఘోషములచే
పొంగుచు వీధుల- కేగుచు మొరయుచు

2. చక్కని హరి చే-జిక్కెతి మని మది
చొక్కుచు నామమే-దక్కని పొగడుచు

3. దిట్టముగా నడు-కట్టుతో యడుగులు
బెట్టుచు తాళము-బట్టి ఘల్ ఘల్లనగ

4. జ్ఞానముతో రామ - ధ్యానముతో మంచి
గానముతో మేను - దాన మొసంగుచు

5. రాజరాజునిపై - జాజులు చల్లుచు
రాజిల్లుచు త్యాగ - రాజునితో గూడి

వెనుక ఇతరకీర్తనములుపాడి గ్రామప్రదక్షిణము జేసి తిరిగి వచ్చేటప్పుడు పాడవలశిన కీర్తనములు.

రాగం - మధ్యమావతి. తాళం - ఆది.

ప॥ ఓ రఘునందన రారా - రాఘవా - శ్రీరఘునందన రారా
ఆశ్రితసముదయమందార-ఓరఘు

1. యాది యుంచుమి నామీద-నీ కే దయ రావలెనుగాదా

పాదములకు ప్రమొక్కెద-నాకు ప్రత్యక్షము కారాదా

2. నీ కారుణ్యముతోను-నేను నిర్వహింప దలచెను
నీ మరులు కొన్నాను.నీ నిద్దంపు మోము జూచెను

3. సరసిజభవనుత శౌరి-నీ నరి దైవము లేక యేరి
శరణంటి నిను గోరి శరజాలశరాసనధారి

4. సతతము నా మదిలోను-నిను సంస్మరింప దలచెను
గతి నీవని నమ్మినాను-యే గతి బ్రోచిన నీవేను

5. వరభద్రాద్రినివాస - భా వజశతకోటివిలాస
పరమానందవికాస పరిపాలితశ్రీరామదాస

—+ + —

రాగం - కాపి. తాళం - ఆది.

ప॥ దేవ బందా నమ్మ రంగ బందానో
దేవరదేవ శిఖామణి బందానో

1. మందరోద్ధార బందా మామనోహర బందా
బృందావనపతి - గో వింద బందానో

2. ఉరగశయన బందా గరుడవాహన బందా
నర గొలిదవ బందా నారాయణ బందానో

3. నరహరిరూప బందా నరకసంహార బందా
సురమునివంద్య బందా సుగుణాఢ్య బందానో

4. నిగమగోచర బందా నిత్యతృప్తను బందా
నగుముఖ పురందర విఠ్ఠల బందానో

## ఉత్సవమండపలోగవచ్చేటప్పుడు పాడవలసిన కీర్తనము.

---

రాగం-ఉసేని. తాళం-చాపు.

ప॥ రామకృష్ణరు మనిగే బందరు బాగిల తెగియరో
అ॥ కామధేను బందంతాయితు - ఫలవ బేడిరో
1. చండు బుగరి చిన్నిగోలు గజుగ వాడుత
దండుమల్లిగె ముడిగె ముడిదు కొళల నూదుత
మిండి హెంగళ ముద్దు ముఖద సొగస నోడుత
భండ మాడి భామెయరొడనే సరస వాడుత
2. మకరకుండల నీలము త్తిన చౌకళి యిడుతలి
కంకణ హార తోళ్బందితోడిగె తొడుతలి
ముఖదకమల ముగుళునగెయ సుఖవ కొడుతలి
సుకుమారసుందరవాద యుడిగె యుడుతలి
3. పొక్కళల్లి అజనపెత్త దేవదేవన
చిక్కవంగుష్ఠదల్లి గంగెయ పడద నాథన
మక్కళమాణిక గురుపురందర విట్టలరాయన
అక్కరఇందలి ముక్తి కొడువ స్వామినాథన

---

## కర్పూర ఆరత్తి.

దీపము మళ్లీ దేవుడెదుట పెట్టి సంగ్రహాముగ దివ్యనామ సంకీర్తనముతో దీపప్రదక్షిణము చేయవలయును

---

## దీపసమారోపణము.

---

### ఆరత్తి - మంగళం.

రాగం-సురటి. తాళం-చాపు.

ప॥ మంగళం భవతుతే మంగళం

1. అట్టె సురలు మొర బెట్టగ సన్నుతించి
గట్టిగ కౌసల్య గర్భమందు జొచ్చి
పుట్టి యా తాటకిని - కొట్టి పారవేసి
పట్టె జానకి చేపట్టిన రామా

2. మించి భార్గవుని జయించి యయోధ్య ప్రవే
శించి కైకయీవరము - నుంచి పాలించి
వంచకులై నట్టి - కొంచ దనుజుల కో
పించి దూషణాసురుల - ద్రుంచిన రామా

3. మారీచు తెగనేసి - మగువను గొనబోవ
మారుతాత్మజు బ్రోచి - మర్మము లెల్ల దెలిసి
చేరి సుగ్రీవుని - మీరి వాలి నేసి
ధారిణీసుతు కన్న - దశరథ రామా

4. ఘట్టిగ సేతువు - కట్టి దైత్యుల నెల్ల
మెట్టి రావణాసురుల - కొట్టి కాలబెట్టి
అట్టె విభీషణుని - కా లంకారాజ్యము
పట్టముగట్టిన - పట్టాభిరామా

5. పొంగుచు దేవికో - పుష్పక మెక్కి వచ్చి
బంగారు కిరీటము - బాగుగ ధరియించి

మంగళకోసల మహీపతియ యయోధ్యలో
శృంగారముగానున్న - సీతాభిరామా

రాగం - తోడి. తాళం-చాపు.

ప॥ జయమంగళం శుభమంగళం

1. ఆదిమధ్యాంతరహితానందకంద - సద్
బోధమయరూప-భోగిశయనా
వేద వేదాంతములు వెతికి కానని నీదు
పాదపద్మంబుల భజియించితి

2. అచ్యుతానంత గోవింద పరమానంద
సచ్చిదాకార సర్వేశ కృష్ణా
ఇచ్ఛతో నే నిపుడు కృష్ణార్పణము చేసి
నిచ్చి వేడితి నయ్య వారిజాక్షా

3. పంకజాసనవినుత పరమానందచరిత
శంకరప్రియ సుభగ సుందరాంగ
వేంకటేశ్వర నన్ను వేగమే బ్రోచుటకు
ఇంక తామస మేమి యిపుడు నీకు

రాగం - కాంభోజి. తాళం - ఆది.

ప॥ దశరథసుకుమార-నీరదమందార-దశముఖహార జయమంగళం

1. పశుపతిహితకర - పరమదయాకర-శరదిందువదన - మంగళం
నిశిచరచయహార - నిర్వికార - శశినిభరూప - మంగళం

2. అండజవాహన కుండలిశయనా ఖండితేజోనిధే - మంగళం
పండితవరజన చండకిరణకుల-మండన మండిత మంగళం

3. కామితఫలద - కరుణాసింధో - భీమపరాక్రమ మంగళం
శ్యామళవర్ణ సుత్రామవినుత - పరంధామ శ్రీరామ - మంగళం
4. కోసలాధిపతే - కుశికసవనవిశ్వాస సీతాపతే మంగళం
భాసురకౌస్తుభాభరణ - నారాయణదాసహృదయవాస మంగళం

---

నిత్యోత్సవ సంప్రదాయక్రమేణ జానకీకాంతస్మరణ మిత్యాది
సకలదేవతాస్మరణం - నమస్కారం.
భాగవతానాం పరస్పరాలింగనం - నమస్కారం.

---

స్వామికి దృష్టితీయుట.

రాగం - సావేరి. తాళం - చాపు.

ప॥ దృష్టి నాకేను మా స్వామికి - దీవింపు రే మునులారా
సృష్టి పరిపాలనంబు జేసినాడని జనుల - దృష్టి
1. ఆదిమధ్యాంతము లేని అఖండాకారు వీడని
వేదవేదాంతము లెల్ల వివరించి విన్నవింప
2. ఈడు లేని రూపమున ఇందిరాదిరమణులెల్ల
జోడుగూడి స్వామి మేను జూచి జూచి ఆశపడ
3. అబ్జదళనేత్రా నీ భద్రశైలమున నెలకొన్న
వేంకటరమణ యని - వేడిన భాగవతుల

రక్ష.

రాగం - భైరవి. తాళం - ఆది

ప॥ రక్ష బెట్టరే దొరకు రక్ష బెట్టరే.
అ॥ వక్షస్థలమున వెలయు లక్ష్మీరమణునికి సాయ

చ॥ సీతా కరమును బట్టి చెలగిన దొరకు
వాతాత్మజునికి చేవశమైన దొరకు
పురుహూతాదుల రక్షింప బాహుజుడైన దొరకు
సంగీతప్రియత్యాగరాజగేయుడైన దొర-కైశ్వర్య

రాగం - కేదారగౌళం. తాళం - ఆది.

ప॥ కలయ కల్యాణాని నారాయణ
బలభద్రావరజాయ నారాయణ

1. సరసిజనయనాయ సకలలోకహితాయ
నరలోకసంభవాయ నారాయణ
శరదిందు వదనాయ శతమన్మథసమాయ
నిరవధికగుణాయ - నారాయణ

2. గురుతరకరుణాయ గోకులభూషణాయ
పరిజనపాలనాయ - నారాయణ
నిరుపమసుందరాయ నీలమేఘనిభాయ
పరమపురుషలక్షణాయ - నారాయణ

3. నందగోపసుతాయ నగరాజధీరాయ
సుందరచరణాయ - నారాయణ
ఇందిరామందిరాయ ఈప్సితఫలదాయ
చందనాదిగంధితాయ నారాయణ

4. నవపల్లవకరాయ నవమణిభూషితాయ
కవిజననాయకాయ - నారాయణ
అవనీవల్లభాయ ఆశ్రితవత్సలాయ
శివనారాయణతీర్థ - సేవిత నారాయణ

శ్లో॥ కైలాసేసత్యలోకే రవిశశిభువనే సప్తసింధ్వాంతరంగే-
వైకుంఠే స్వర్గలోకే సకలజనహృది స్థావరే జంగమాంతః।
క్షీరాబ్ధౌ భక్తబృందే సుగనవనిలయే మేరుశృంగేవసంతాత్-
సాకేతేసాక్షిభూతో రమయతి పరమానందసందోహరామః॥

---

రాగం - ఆనందభైరవి. తాళం - ఆది.

ప॥ అంతా రామమయ మీజగ - మంతా రామమయం

1. అంతరంగమున నాత్మారాముడ
నంతరూపముగ వింతలు చెలుపగ

2. నదులు వనంబులు నానామృగములు
విహితకర్మములు వేదశాస్త్రములు

3. సోమసూర్యులు సురలు తారలు
ఆమహాంబుధు లవనీతలంబులు

4. అండాండంబులు పిండాండంబులు
బ్రహ్మాండంబులు బ్రహ్మలు మొదలుగ

5. అష్టదిక్పతులు - నాద శేషుడును
అష్టవసువులు నా షడ్భూతులును

6. ధీరుడౌ భద్రాచలరామదాసు
కోరిక లొసగిన తారక నామము

---

రాగం - ... - చాపు.

ప॥ ఎక్కడ పూజింతు నేను - ... శ్రీరాములను

1. ఇక్క డక్కడ - యెక్కడ ...
యొక్కటియాత్మయై - మక్కువై ...